# ఒక రోజు



[నాటిక]

రచన:

కె. యల్. నరసింహారావు

పాటలు:

సి. నారాయణరెడ్డి




వెల:
రూపాయి

# ప్రస్తావన

ఈ యేడే నూతనముగా స్థాపితమైన మా సమితి నిధి సేకరణకు గాను ఒక ప్రదర్శన మివ్వవలసిన అవసర మేర్పడినది. ఈ సందర్భమున వినోదపూరితమును, విజ్ఞాన ప్రదముసైన నాటికను, సందర్భానుసారముగా కొన్నిపాటలతో ప్రదర్శించు యుద్దేశమే యీనాటికను ప్రత్యేకముగా వ్రాయించుటకు గల కారణము. దీని మూలమున ప్రస్తుతము వెలువడు చున్న నాటికలలో సంగీత సమన్వయములేని కొఱతయు కొంతవఱకు తీరినది ప్రదర్శనానంతరము మఱుగున పడకుండుటకుగాను మా సమితి దీనిని ప్రచురించుచున్నది.

కోరగానే నాటికను వ్రాసియిచ్చిన శ్రీ కే. యల్. నర్సింహారావు, పాటలనువ్రాసియిచ్చిన శ్రీ సి. నారాయణరెడ్డి మఱియు ముఖచిత్ర మును వ్రాసియిచ్చిన శ్రీ కే. శేషగిరిరావుగార్లకు మా సమితి సర్వదా కృతజ్ఞి.

ఈ నాటికా ప్రదర్శనసందర్భమున నాతో సహకరించిన రెడ్డియువ జనసంఘమువారికిని, అన్నివిధముల చేయూతనొసగిన మన్మిత్రబృందము నకు నా ప్రత్యేక కృతజ్ఞత.

సంగీతసమితి, రెడ్డిహాస్టల్
హైదరాబాద్
అక్టోబర్ 1951.

పి. మాణిక్యరెడ్డి
కార్యదర్శి

# నా మాట



నిజానికీ నాటికను నేనువ్రాసినా-ఇది వ్రాయించడందగ్గరనుంచి అచ్చయ్యేదాకా అన్నివిధాలా పూర్తి శ్రమతీసుకున్నది శ్రీ మాణిక్యరెడ్డిగారు.

శ్రీ రెడ్డిగారు-రెడ్డిహాస్టల్ సంగీతసమితికోసం నాటికొకటి కావాలన్నారు. నాకు తెలిసిన నాటికల్లో అందుబాటులోవున్నవరకు వారి కిచ్చాను. కాని-అవి, వారనుకున్న హంగులకు సరిపోనట్టు తెలిపారు.

అందుకని-వారి కనుకూలమైన సమస్యా, పాత్రలూ, ఇతరహంగులన్నీ దృష్టిలోవుంచుకొని అతిత్వరలో ఒక నాటికను వ్రాసివ్వక తప్పదన్నారు. అంతగా సమర్థతా, అవకాశాలూ లేకపోయినా - వారి అవసరాలూ, వారితోవున్న చనువునుబట్టి అంగీకరించాను.

ఇందులో-ఒక విద్యావంతురాలైన గృహిణి, తన కభిరుచుల కనుగుణ్యమైన కళారంగాల్లో పాల్గొంటే-చుట్టూవున్న సంఘంలో, తను పనిచేసే సమాజంలో, చివరకు ఇంట్లోకూడా ఎలాంటి గాలిదుమారం చెలరేగాల్సి వచ్చిందో, దాని పర్యవసానమేమిటో వీలున్నంతవరకు వాస్తవరూపంలో తెలుపప్రయత్నించాను.

అవసరమైన పాటలను భావానుగుణ్యంగా చక్కగావ్రాసి తోడ్పడ్డారు, శ్రీ. సి. నారాయణరెడ్డిగారు.

ఈ ప్రయత్నంలో విజయవంతమైందంతా శ్రీ మాణిక్యరెడ్డిగారి కృషి. విఫలమైందంతా నా అసమర్థత.

హైద్రాబాద్ }
**20-10-51** }

ఇంతే
కె. యల్.

## ఇందులో —

రాజా

కోటీ

ఇందిర

ఆనందం

సుందరం

పద్మాకర్

జోగారావు

కృష్ణమూర్తి

సోమశేఖరం

# రాజా యిల్లు

[రంగస్థలంలోని ముందరి సగభాగంలో 3 కుర్చీలూ,
... రాజారావు, జోగారావు, సుందరంల ప్రవేశం ]

విన్నారుగా మామయ్యా! అదీ విషయం. మీరొస్తారని ఏ మాత్రం ముందు తెలిసినా, రాజ్యాన్ని అలాపంపేవాణ్ణి కాదు. ఏదో మా పెద్దక్కయ్యకు కాస్త సుస్తీగా వుందని వెళ్ళింది.

దాన్దేమిటి రాజా! రాజ్యాన్ని చూడలేదనే కొరత నాకేమీ లేదు. బహుశా అబ్బాయిక్కూడా వుండక పోవచ్చు.

అవును మరి. సత్యానికి మాత్రం కొత్తా ఏమిటి?

అంతేలే. (రాజాతో) కాకపోతే ఈ 2, 3 ఏడ్లనుంచి ఏదో మేమిక్కడ వుండడంలేదనేగాని నీవు కొత్తా? నీ చెల్లెలు కొత్తా? అయినా ఎప్పటికప్పుడు మీ క్షేమసమాచారాలు మా సుందరం అందజేస్తూనే వున్నాడుగా.

ఇప్పుడేదో కాస్త యిండ్లు దూరమయ్యాయనేగాని, లేకుంటే 24 గంటలూ కలిసే వుండేవాళ్ళంగదూ!

కలయిక యిప్పుడిక మా యిద్దరికీ ఆఫీసులో మాత్రమే అవుతోంది.

జోగా: పోనీ, నీవూ యిక్కడే యిల్లుతీసుకోకపొయ్యావురా సుందరం?

సుంద: లేదులే అన్నయ్యా! ఇక్కడున్నంచే అక్కడికి వెళ్ళడం జరిగిందిగా. ఎలాగైనా మా ప్రాంతాల్లో యిండ్లు అనుకూలంగా వున్నాయి. ఏమంటావురా రాజా?

రాజా: బాగుంది. ఆ అనుకూలతేమిటో నాకెలా తెలుస్తుంది చెప్పు?

సుంద: ఆఁ! అదీ, యిదీ అన్నివిధాలాననుకో, ఎలాగైనా. అదంతా ఆడవాళ్ళ అంగీకారమ్మీద ఆధారపడి వుంటుంది. ఏమంటావు?

రాజా: కావచ్చు—ఆఁ! ఇంతకూ మీ అభిప్రాయాన్నేమిటో వెలి వెలిబుచ్చారుకాదు.

జోగా: ఇందులో పెద్ద అభిప్రాయాలు వెలిబుచ్చాల్సినంత విశేషమేముందని? మీ చెల్లెలు వివాహం చెయ్యాల్సిన బాధ్యత నీకెంతుందో, మా అబ్బాయి పెళ్ళి చెయాల్సిన బాధ్యతకూడా నాకంతగా వుందనేది నీకు వేరే చెప్పేదేముంది?

సుంద: ఇందులో ప్రత్యేకమైన మహత్తరసత్యమేముందో మాత్రం నాకే తెలియడంలేదుమరి. ఇక్కడికీ, పట్నానికీ ఎంతదూరమో, పట్నానికీ యిక్కడికీ అంతే దూరంగా.

రాజా: చాల్లే. పూరుకో సుందరం! నీ పోలికలూ, నీవూ.

జోగా: అసలు. మా సుందరానివన్నీ మా మామయ్య పోలికలు.

సుంద: ఒకళ్ల పోలికలు మరొకళ్లకొస్తాయా అన్నయ్యా?

జోగా: ఆహా! రాకుండా వుండవనే అంటారు తమ్ముయ్యా.

రాజా: (నవ్వి) మొత్తానికి పెద్దవారు మీరూ బాగానే నవ్విస్తారు.

జో॰గా: చూస్తున్నావుగా మరి రాజూ! మనం మాట్లాడుకునేదేమిటి? వాడు మధ్యలో గొడవేమిట్రి?

రాజా: వాడెక్కడైనా అంతేలెండి. సరె, దానికేం? ఇంతకూ మీ అభిప్రాయమేమిటో — —?

జో॰గా: ఏం, అంత తొందరపడుతున్నావు?

సుంద: కారణమేముందీ? ఎలాగూ అమ్మాయీ పెద్దదైపోయింది బాధ్యతా నెత్తిమీదవుంది. అందులోనూ తల్లి దండ్రులు వది లిన భారాన్ని సక్రమంగా నిర్వర్తింపలేక పోతానేమోనని భయం.

జో॰గా: అవును మరి. బాధ్యతన్నాక భయముండడంసహజం. అంతేనా రాజూ!

రాజా: మీకు తెలియందేముందీ? అనుభవజ్ఞులు.

జో॰గా: సరే. ఇవేళా రేపూ మా అనుభవాలకు విలువ ఎవరిస్తారు? కాని, ఆఁ! అయితే చూడూ! ఈమధ్య నేవో యితర సంబం ధాలు చాలా వచ్చి వెళ్ళినట్టు విన్నానే. ఏమైంది?

రాజా: అవును. మళ్ళీ ఎవరూ ఏ జవాబూ యివ్వలేదు. అయినా మీ సంబంధం కుదిరితే నాకు వేరే కావాల్సిందేముంది?

జో॰గా: అలా అనకులే. నేనూ పదిమందిలో ఒకణ్ణేగా. కాకపోతే మీకు చిరపరిచయుణ్ణి. అంతెందుకూ? మీ నాన్నా, నేనూ ఎంత గాఢమిత్రులమో తెలుసుగా?

రాజు: అందుకేగా. నా సంతోషంకూడాను.

సుంద: అన్నట్టిప్పుడు, మీ అమ్మా, నాన్నా ఎక్కడుంటున్నట్టురాని? గాంధీనగర్ లోనేనా?

జోగా: అవును. అక్కడే వున్నారు. కాని (రాజాతో) అబ్బాయీ! వాళ్ళెంత తిప్పలుబడుతున్నారో ఆలోచించావా?

రాజా: నన్నేంచేయమంటారు మామయ్యా! వారి పట్టుదలలు పెంచుకొని, వేరుబడిపోవడం నాకుమాత్రం యిష్టమా?

జోగా: పెరిగిపోయిన పట్టుదలలకూ, పగలకూ మీ యిష్టాయిష్టాలక్కర్లేకపోవచ్చు. కాని బాబూ! దాని పరిణామానికి ఎవరిదో ఒకరిది కొంత లోపముందనేది మాత్రం ఒప్పుకుంటావా?

రాజా: ఎటుబడీ యిక నాదేనంటారంతా.

జోగా: అంతా అలా అంటున్నారనే వాపోతావుగాని, ఎందుకలా అంటున్నారోకూడా ఆలోచించాల్సిన బాధ్యత, అన్నీ తెలిసినవాడివి నీకు మాత్రంలేదా చెప్పు!

రాజా: మీరన్నట్టు, అమాత్రం బాధ్యతలేదని ఎందుకంటానూ? ఉంది. అందుకనే బాగా ఆలోచించాను. కాని ఎక్కడా నా తప్పు కనిపించలేదుమరి.

సుంద: తన తప్పు తనకు తెలిస్తే ఏదో అన్నారు. బహుశా బ్రహ్మజ్ఞాని కావచ్చు. కనుక అదే జరిగితే ఈ గొడవలెందుకుంటేవీ లోకంలో?

జోగా: మన ఆలోచనలెప్పుడూ మన వాదాలను సమర్థించుకొనేట్టుగానే వుంటాయిగాని, ఎదుటివాని వాదంలోని నిజమేమిటో

కూడా తెలుసుకోవాలనే నిష్పాక్షికదృష్టివుండడం చాలా కష్టం బాబూ!

సుంద: ఆ దృష్టి వుండడమంటే సామాన్యమా? అన్ని పరిస్థితుల ఆకళింపూ, బోలెడు సహనమూ కావాలిగా.

జోగా: మనిషిలో ఆ సహనమూ, ఆకళింపూ వుండడమైతే నేరం కాదుగా అబ్బాయీ! ఏమంటావ్?

రాజా: ఆ విసురు నా పైకే విసరడంలో, నా లోపం ?

జోగా: అదిగో! తొందరపడకు రాజూ! ఈ చెప్పేది నిన్ను గురించని కాదు; జగన్నాటకపు పోకడను గురించి.

సుంద: ఆ నాటకంలో మనవాళ్ళ పాత్రేమిటో తెలుసుకుందామని ఆదుర్దాగా వున్నట్టున్నాడు. ఏం రాజూ!

రాజా: అవును. అందరూ అంటున్న ఆ తప్పేమిటో తెలుసుకుంటే మంచిదిగా. ఆఁ! వుండండి! కోటీ! కోటీ!

కోటీ: ఆఁ! వత్తుండదొరా! (వచ్చినుంచున్నాడు)

రాజా: ఇంకా కాఫీ తయారు కాలే?

కోటీ: అయింది దొరా!

రాజా: మరైతే తొందరగా తీసుకొస్తిరా మరి.

కోటీ: వస్తి దొరా! (వెళ్ళాడు)

జోగా: ఏం రాజూ! కొత్త నౌకర్ని పెట్టినట్టున్నావ్?

రాజా: అవును. నౌకర్రే అయినా చలాకీవాడు. అయినా మా నన్న పెద్దపనులేమున్నాయని? బజారుకెళ్లి కూరగాయలు తేవడం,

కాఫీ, అన్నం తయారుచేసిపెట్టడం, ఏవో చెప్పిన పనులు చెయ్యడం.

జో॰గా: కావచ్చులే. అదని కాదు, నేననేది. ఆ రోజుల్లో అంటే మే మిక్కడున్నప్పుడు వీడు లేనట్టున్నాడు.

రాజా: అవును. అప్పుడొక పెద్దవాడుండేవాడు. కాని ఆ గొడవ జరిగాక, వాడు నాన్నా, అమ్మతో వెళ్లాడు.

సుంద: మొత్తమ్మీద పెద్దవాళ్ళపక్షంకూడా బలంగానేవుంది సుమా!

జో॰గా: బలాబలాలతో పనేముంది సుందరం, న్యాయాన్యాయాలతో గాని. ఆఁ! వీడి పేరు? ఇప్పుడేమని పిలిచావ్రా? ఏమిటదీ?

రాజా: అదంటారా? ఆఁ, కోటీ అని.

సుంద: భలే పేరుపెట్టావు. కోటీ ఏమిటి, పీ పీ అన్నట్టు. ఇంతకూ వాడిపేరు ఏ కోటిగాడో అయ్యుంటుంది. అంతేనా?

రాజా: అయ్యే వుంటుంది. ఏదో కాస్త తెలివి సంపాదించాక కోటప్పయివుంటాడు. ఆ రూపంలో మాదగ్గరకొచ్చినపేరును మే మేదో సింపులుగా కోటీ అని మార్చాం.

సుంద: మొత్తమ్మీద మంచో చెడో కొద్దిపాటి మార్పులేవో చేస్తూ వుంటావుసుమా!

జో॰గా: సరే, దానికేం? కాని మనలోనూ, మనంపెట్టేపేర్లలోనూమార్పు కనబడుతున్నదే కాని వాళ్ళలోనూ, వాళ్ళ బుద్ధుల్లోనూ, వాళ్ల చుట్టూవున్న వాతావరణంలోనూ మార్పు వస్తున్నట్టు నాకేం తోచదు. కాని నిజానికి రావలసిన మార్పు అదంటాను.

సుంద: నిజమే. కాని వాళ్ళది గుర్తిస్తేగా?

రాజా: అయ్యో! తొందరలో ఆ మార్పురావాలంటే ఎలా సాధ్యం? క్రమక్రమంగా—

జోగా: ఏమో సుందరం! నీవేమైనా అనుగాని, యిదంతా పూరికే వాడానికి అందంగా కనబడుతుందేగాని, యిన్నాళ్ళనుంచి చూస్తున్నానుగా. కాని నీవనే అక్రమక్రమపరిణామమనేది, నాకిప్పటిదాకా ఏమీ గోచరించలేదంటే నమ్ము.

రాజా: ఇక మీరలా అంటే నేనేం చెప్పను? (కోటీ కాఫీకప్పులు డ్రాయరుమీద పెడ్తాడు) ఇదిగోండి (తీసుకుంటారు ముగ్గురూ)

జోగా: నేనలా అనడమంటే పూరికే ఆలోచించకుండా అన్లేదు. జాగ్రత్తగా ఆలోచించి, చూచే అన్నాను.

రాజా: కావచ్చు, అదలావుండనివ్వండి. ఆఁ! ఇందాకేదో నా లోపాలన్నారు.

జోగా: అదలా వ్యక్తిగతంగా తీసుకోవద్దన్లే మీబోటి వేడిరక్తం వుప్పొంగుతున్న యువతీయువకుల సంగతి నే చెప్పేది.

సుంద: ఇప్పుడు యువతుల ప్రశంసెందుకన్నయా?

రాజా: సీరియస్ విషయాల్లో పరిహాసాలాడకు సుందరం.

సుంద: నీ లోపాలు తెలుసుకోవాలని ఎంత ఆదుర్దాగా వున్నావేరా రాజూ!

జోగా: తెలుసుకోవాలనే ఆదుర్దా అందరికీ వుంటుంది. కాని, తెలుసుకున్నాక, అవి తమ లోపాలని అంగీకరించి, ఆచరించడమే జరగదు.

సుంద: అక్కడ తమ అభిమానాలూ, పరువుప్రతిష్టలూ అడ్డొస్తాయేమో బహుశా.

జోగా: అది సహజం. కాని ఉత్తముని లక్షణం వాటిని పాటించడం కూడదంటారు మరి.

రాజా: ఇంతకూ అసలా లోపాతేమిటో ?

జోగా: వస్తున్నా. తొందరపడకు రాజూ! మీ బోటి యువకులెప్పుడూ వర్తమాన చరిత్రనే అలా పైపైన చూస్తారు.

రాజా: అలా చూడడంలో తప్పేముంది?

జోగా: వాక్యమింకా పూర్తి కాలేదు.

సుంద: కామా దగ్గరేవుంది; ఫుల్ స్టాప్ పడలేదన్న మాట.

జోగా: అవును...వర్తమానం చూడడంలో తప్పుందని నేనడం లేదు. గత చరిత్రను.

రాజా: అంటే భూత కాలాన్నంటారా?

జోగా: అవును, భూతకాలాన్ని చూడలేకపోవడం తప్పంటాను.

సుంద: భూతమంటే ఎలాగైనా భయంకలగడం సహజమే గా అన్నయ్యా!

జోగా: సరిగ్గా అలాగే వున్నట్టుంది, చూడబోతే. కాని, భూతం లేని వర్తమానమూ, వర్తమానంలేని భవిష్యత్తూ వుండవనేది మీకు తెలియని రహస్యం కాదు.

సుంద: అవును. వర్తమానానికి భూతమెలాగో, భవిష్యత్తుకు వర్తమానమలాంటిదేగదూ!

రాజా: సుందరం! నువ్వు వాక్యాల గారడీ చెయ్యకిప్పుడు.

జో॥గా: ఆ గారడీలోకూడా ఒక సత్యముంది మరి. అవును. సుందరం అన్నట్టు భవిష్యత్తుకు వర్తమానం భూతమేగా?

రాజా: ఇంతకూ, మీరు చెప్పదలచుకుందేమిటో?

జో॥గా: కటాపిట్ గా సూటిగా మూడు ముక్కల్లో చెప్పడం సాధ్య పడేదికాదు మరి. ఇప్పటి పోకడలను గురించి చెప్పాలంటే గత చరిత్రను చెప్పక తప్పదు. అందుకని, కాస్త వోపికగా విని, జాగ్రత్తగా ఆలోచించాల్సి వస్తుంది.

రాజా: పోనీండి. ఇంతకూ మేము గతచరిత్రను ఆలోచించందెక్కడంటారు?

జో॥గా: ఎక్కడేమిటి? అడుగడుగునా అంతే. ఎంతసేపూ యిప్పటి పరిస్థితులమీదనే దృష్టి.

రాజా: అంత అన్యాయమంటారా?

జో॥గా: కాకుంటే, యింత అన్యాయముండదు మరి.

సుంద: ఇప్పుడు జరుగుతున్న అన్యాయమేమిటంటావేమిటి?

జో॥గా: అలా అడగండి. ఇప్పటి అన్యాయమేమిటంటే, అప్పటి న్యాయాలూ, ఆచారవ్యవహారాలూ తెలిసి వుండాలిగా.

రాజా: తప్పకుండాను.

జో॥గా: అయితే, అప్పుడు మనకు సమాజంలో వున్న పరువు ప్రతిష్ఠలూ, మాన మర్యాదలూ ఏమిటో తెలుసా?

సుంద. ఏ విషయంలో నంటావు?

జో॥గా: ఒకటేమిటి? అన్ని విషయాల్లోనూ. మన మాటంటే పదిమందిలో

గౌరవం, మన పిల్లలంటే పదుగురిలో మర్యాద. ఇవి చాలవూ మంచి చెడ్డలు తేల్చటానికి.

సుంద: ఇప్పుడవి లేవంటావా యేమిటి?

జో గా: ఎవరికి వారే వుందనుకుంటే మరొకరి సలహా, సంప్రదింపులూ అవసర ఆసరాలూ ఎందుకింకా? నిజంగా అలావుంటుంటే, ఈ గొడవలుండేవి కావు.

రాజా: ఏ గొడవలంటారు?

జో గా: ఏ గొడవలేమిటీ? అన్ని గొడవలూ. మచ్చుకిప్పుడు మీ పరిస్థితే తీసుకుందాం.

సుంద: ఇది, మరీ తేలిగ్గా అర్థమవుతుంది.

జో గా: అందుకే మరి. చూడు రాజా! నీకూ, మీ నాన్నకూ మనస్పర్థలొచ్చింది ఏ విషయంలోనో నీకు తెలుసుగా.

సుంద: బహుశా, వాడి పెళ్ళి విషయంలోనని జ్ఞాపకం.

జో గా: నీ జ్ఞాపకాలలావుంచు సుందరం. నీ అభిప్రాయమేమిటో చెప్పు రాజా!

రాజా: అందరికీ తెలిసిన విషయంలో నా అభిప్రాయం మాత్రం వేరే ఏముంటుంది? అవును. సుందరం అన్నది రైటే. పెళ్ళి విషయంలోనే.

జో గా: పెళ్ళి విషయంలో, అంటే యీ అమ్మాయిని చేసుకోవడం— అమ్మాయి పేరేమిటో వుండె?

సుంద: ఇందిర.

జో గా: ఆఁ! ఇందిరను నీవు చేసుకోవడం వాళ్ళకు యిష్టంలేదుకదూ!

రాజా: అవును.

జో॰గా: అయితే, ఎందుకిష్టంలేదో నీవు గ్రహించావా?

సుంద: ఎందుకంటే, ఇందిర—

జో॰గా: ఆగు సుందరం! మధ్య నీ అభిప్రాయాలెందుకూ? నీవు చెప్పు రాజూ! ఇందిరను చేసుకోవడం ఎందుకిష్టంలేదో గ్రహించావా?

రాజా: సుందరమేదో చెప్పబోతున్నాడుగా. చెప్పనివ్వండి, విందాం. అదెంతవరకు సమంజసమో తెలుస్తుంది.

జో॰గా: రాజూ! అనవసరంగా యితరుల అభిప్రాయాలకోసం ఎందుకు చూస్తావు? నీ ఉద్దేశమేమిటో చెబుదూ!

రాజా: నా ఉద్దేశమేమంటే అసలు నాన్నకు నాకు మేనరికపు సంబంధం చెయ్యాలని అభిలాష.

సుంద: కొంతవరకు నా ఉద్దేశంకూడా అదే.

జో॰గా: వంతబాడకు సుందరం! మరైతే చూడు రాజూ! ఆ సంబంధం, అంటే ఆ మేనరికపు సంబంధం నీకొకటివుందనీ ఆ సంబంధంతోటే తప్పకుండా నీ పెండ్లి జరుగుతుందనీ, ఒక్క మీ నాన్నే కాదు. మీ అమ్మా మీ అక్కలూ, యిప్పటి మీ చెల్లెలు రాజ్యం, యింకా మీ బంధుకోటిలోని వాళ్లమైన మేమూ, మిత్రులనేకమందీ మొదటినుంచీ నిక్కచ్చిగా అభిలాషపడుతున్నారన్న విషయంకూడా నీకు స్పష్టంగా తెలుసుగా?

సుంద: తెలియదమేమిటన్నయ్యా! అసలు వాడిఅత్తకు మొదటికాన్పు కూతురే పుట్టాలనికూడా అంతా కోరుకోవడం, అలాగే అదృష్ట వశాత్తూ సంభవించడం, అప్పట్నుంచే ఆ అమ్మాయినీ, వీణ్ణీ

భార్యాభర్తలంటూ అందరూ మురిసిపోవడం, యిదంతా మరిచి పోగల చిన్న దృశ్యమా చెప్పు.

జోగా: ఏం? అంతేనా రాజూ!

రాజా: అవును. అలా జరిగిన మాట మనమెలా కాదంటాం, కాని నాకప్పుడు వ్యక్తిత్వమంటూ లేని రోజులు. నా దృష్టిలో అప్పుడది విలువలేని విషయం.

జోగా: అది సరే. నీకు వ్యక్తిత్వమంటూ లేనిమాట నిజమే కావచ్చు. కాని, మీ నాన్నా వాళ్ళకైతే వ్యక్తిత్వంలేని రోజులనవుగా.

సుంద: ఆదేమిటన్నయ్యా! రాజాను అన్యాయం చేస్తున్నావు.

రాజా: సుందరం! ఇంతవరకు మామయ్యన్నదాంట్లో నాకేమీ లోపం కనబడలేదు మరి.

జోగా: అంతవరకు అంతా వొప్పుకునేదే. తరువాత పరిణామం దగ్గరే పేచీ.

రాజా: అదేమిటో కానివ్వండి. మరోసారి కాఫీ తెప్పించమన్నారా?

జోగా: ఏదో. అది పడితేగాని వినే వోపికలేదా యేమిటి?

సుంద: దాదాపలాగే వుంది నా పరిస్థితి.

జోగా: అదేమిటి సుందరం! ఈ తీరుగా అలవాటుపడ్డావేం కాఫీకి?

సుంద: అది ప్రతి వుద్యోగివెంటాబడి వదిలిపెట్టకుంలే. కారణం, ప్రతి ఆఫీసులోనూ సర్వసాధారణంగా ఒక క్యాంటీనంటూ తయారు కావడం.

రాజా: చాల్లేరా కోతలు. ఈ మాత్రం కాఫీకి అంత అబద్ధమా?

సుంద: దెబ్బకూ, అబద్ధానికీ పెద్దా చిన్నా తేడా లేదన్నారు. ఆ విష యంలో మాత్రం అంతాసమానమేనట.

రాజా: బాగా అన్నావ్లే ఆఁ! కోటీ!

కోడీ: దొరా! (వచ్చాడు)

రాజా: ఇదిగో! ఇవి కడిగి, మరో మూడుకప్పులు పట్రా!

(కోటీ కప్పులతో వెళ్తాడు)

జోగా: పావుగంటలో రెండుసార్లా?

సుంద: ఒక్కసారే చెంబెడు తాగేవాళ్ళతో పోటీ చెయ్యాలంటే కనీసం క్షణక్షణం కాస్త కాస్త తాగైనా కోటా పూర్తి చేయకుంటే ఎలా?

జోగా: అలాగేవుంది చూడబోతే.

రాజా: ఆఁ! సుందరం మాటలకేవొచ్చె లెద్దురూ?

జోగా: వాడిమాట లేమన్నాయెగాని, క్షణంలో సప్లయిచేయడానికి యింట్లో కాఫీ భట్టీ వుంటుందా యేమిటోయ్?

రాజా: ఆఁ! ఈ మాత్రానికి భట్టీ వుండాలాయేం? ఎలాగూ వేళమించ లేదు గనుక నీళ్ళు కాగుతూనే వుంటాయి. అందులోనూ యిందిర యింకా లేచివుండదుకూడాను.

జోగా: ఏం? పొద్దెక్కేదాకా లేవని అలవాటా యేమిటి?

సుంద: అదో పెద్ద బ్రహ్మవిద్యలా చెప్పుతున్నా వేమిటన్నయ్యా? అందరి స్థితీ అంతేగా? అయినా, రాత్రి నాటక బడలిక తీరొద్దూ పాపం!

రాజా: కొంతవరకు సుందరం అన్నది నిజం.

సుంద: మొత్తమీ్మద నా మాటల్లో కొంతన్నా నిజముంటున్నందుకు, ఆంధ్రుణ్ణి గనుక గర్వించక తప్పదు.

రాజా: ఊరుకో సుందరం!

సుంద: మీరేదైనా మాట్లాడితే నేనలాగే ఫ్రూరుకుంటాగా.

(కాఫీవస్తుంది)

రాజా: (సుందరానికి యిస్తూ) ముందిది త్రాగుతూ ఆ మైకంలో పడిపో!

సుంద: నీ వే మైకంలో పడ్డావు?

రాజా: ఆఁ! కానివ్వండి మాఁవయ్యా, ఎక్కడున్నాం?

జో గా: చివరికిదో కథలా తయారవుతున్నదే.

రాజా: జీవితమంతా కథకాదూ?

జో గా: అవున్లే. నీవే చెప్పాలి సమాధానం. అప్పట్లో మీ నాన్నావాళ్ళు కైతే వ్యక్తిత్వ ముందన్నావు కదా! ఉండిమాత్రం లాభం?

రాజా: లాభమంటే నేనేం చెప్పను మావఁయ్యా మరి? వ్యక్తిత్వ మొచ్చాక పెళ్ళి విషయంలో యితరుల జోక్యం తప్పనిపించింది.

సుంద: అదేమిటి రాజా! ఇతరుల జోక్యమంటున్నావు? తల్లి దండ్రులు యితరులెట్లయ్యార్రా?

జో గా: మరి, అదీ ఒక సమంజసమైన ప్రశ్నే రాజూ! ఏం సమాధాన మిస్తావు?

రాజా: వివాహమన్నది ఖచ్చితంగా మనసులు కలిసిన యిద్దరు యువతీ యువకులను సంబంధించిన ప్రత్యేక విషయమేనని నా నమ్మకం.

జో గా: సరే. నీ నమ్మకాలు చెప్పావేగాని, ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలే. పోనీ! పెళ్ళి విషయంలో కాకుండా, తల్లి దండ్రులు ఏ విషయంలో జోక్యం కలిగించుకోవచ్చునంటావు?

రాజా: ఎవరైనా పెంచి పెద్దవాళ్ళను చేసి, వ్యక్తిత్వంవచ్చాక వాళ్ళ సమస్యలను వాళ్ళే పరిష్కరించుకునేట్టు చేయడం తల్లిదండ్రుల విధనుకుంటాను. మీరేమంటారు?

జో॰ గా॰: నే నేమంటాను. నీ వన్నంత నిక్కచ్చిగా కుదరదేమో నంటాను. అన్ని విషయాల్తోపాటు పెళ్ళివిషయంకూడా వాళ్లకు సంబంధ ముంటుంది మరి.

సుంద: రాజా! మళ్ళీ నీ స్వార్థంకోసం నీ వాదాన్ని బలపరచుకుంటు న్నావు. లేకుంటే, నీకు చెల్లెలు రాజ్యం పెళ్ళివిషయంలో ఆ బాధ్య తెందుకూ?

జో॰ గా॰: ఇదీ సరియైన ప్రశ్నే రాజా! మరి, దీని కేమంటావు?

రాజా: ఇది దానిష్టప్రకారమే చేస్తున్నాను.

జో॰ గా: అయితే నీకు మేనరికం చేద్దామనుకోవడంకూడా నీకు యిష్టమవు తుందనేగా?

రాజా: కావచ్చు.

సుంద: అదిగో! ఆ వొంక తిరుగుడే వొద్దుమరి. కావచ్చే వేమిటీ? అంతే నను.

రాజా: వాళ్ళ మనసులో మాట మనకెలా తెలుస్తుంది?

జో॰ గా: ఏ తల్లి దండ్రులూ, అన్నలూ, అక్కలూ తమవాళ్ళకు అప కారమైతే చేయాలనుకోరుగా? అందాకా ఎందుకు? నీవు మీ రాజ్యానికి అపకారం చేద్దామని కాదుగా మా సంబంధాన్ని మాట్లాడుతున్నది?

రాజా: ఛాఛా? అదేం తప్పుమాట?

జో॰ గా: ఎబ్బే! ఇక్కడ తప్పొప్పుల విషయంకాదు నేననేది. మచ్చుకు చెప్పాను. కనుక మీ వాళ్ళు నీకు మేనరికం చేద్దామనుకున్నది కూడా నీకు యిష్టమవుతుందనే. కాని, నీవు వాళ్ళ యిష్టాన్ని నెరవేర్చలేకపోయ్యావు. అంతేనా?

రాజా: అవును. ఇందిరను చేసుకున్నాను.

జో౹గా: పోనీ, ఆ సంబంధంవద్దనిగానీ, ఇందిరను చేసుకోనున్నాననిగానీ ఆయన కేమైనా చెప్పావా?

రాజా: ఆ అవకాశం లేకపోయిందప్పట్లో.

జో౹గా: నీ అవకాశం లేకపోవడం వాళ్ళ హృదయాల నెంత గాయ పరచిందో, వారి ఆశా సౌధాల నెలా ఒక్కుమ్మడిగా కూల్చే సిందో నీకేమైనా తెలుసా?

రాజా: రెండువైపులా ఎలా ఆలోచించాలి?

జో౹గా: నీ విషయం వాళ్ళాలోచించగాలేంది, వాళ్ల విషయం నీ వాలో చించకపోవడంలో ఎవరిదీ తప్పు?

సుంద: ఏం? చెప్పవేం రాజా?

రాజా: చెబుతాను. ఏమీ తోచడంలేదు.

జో౹గా: అందుకే, మీరు భూతాన్నాలోచించరు. వర్తమానాన్నాలోచిస్తారన్నాను.

సుంద ఓహో! అందుకా?

జో౹గా: అవును. అందుకే. దానివల్ల ఎన్ని అనర్థకాలు వాటిల్లాయో తెలుసా?

రాజా: ఏమిటంటారు?

జో౹గా: ఏమిటేమిటి? మీ వాళ్లకు కోపంవచ్చి దూరమయ్యారు. మీ మావాం, అత్తలకు కోపమొచ్చింది. పైగా, ఆ అమ్మాయిని చేసుకోకపోవడానికి వేరే కారణాలేమైనా వున్నాయేమోనని ఆ అమ్మాయికి చాలా రోజులదాకా మంచి సంబంధాలే రాలేదు. మొత్తంమీద ఈ ముఖ్య విషయమ్మీద మీ కుటుం

బం యిలా అంతా తలోమార్గం పట్టారు. ఇక- మీ బంధువు లందరికీ నీవంటే ఎందుకు అయిష్టతో తెలుసా?

రాజా: వారికి నేను చేసిన అపరాధం?

సుంద: అదేమిటో నీ వాలోచించాలి.

జో గా: ఇందాకా వచ్చాక, అదీ నేనే, చెబుతాను, నీకు కష్టం కలగ దంటే.

రాజా: చెప్పండి, ఇందులో కష్టం కలిగేదేముంది ?

సుంద: ఉండొచ్చు మరి.

రాజా: నిజాలెప్పుడూ అలాగే వుంటాయంటారు.

జో గా: నీ కా నమ్మకమంటే చాలు. నీ బంధువుల కెందుకు అయిష్ట మంటే? నీవు ఇందిరను చేసుకోవడం.

రాజా: చేసుకుంటేయేం? ఇందిర మన కులపుపిల్ల కాదా?

సుంద: కులమనే పట్టింపాకటున్నాక, కులానికి తగ్గ కట్టుబాట్లుకూడా కొన్ని యేడ్చాయిగా పాడై.

రాజా: అంటే యేమిటో, నా కర్థం కాలే.

[కోటీ పత్రిక తెచ్చి యిస్తాడు. జో గారావు అందుకుంటూ]

జో గా: అర్థం కాలే? అదేమిటో యిదిగో! కాస్త పత్రిక తిరిగేసి చెబు తాను

సుంద: ఏదీ, ఒక్కసారి అన్ని పేజీలూ ఒకసారి గిరగిరా తిప్పెయ్యి అన్నయ్యా! హెడ్డింగులేమిటో చదివేద్దాం.

జో గా: (పేజీలు తిరగవేస్తూ) ఆః ర్జించే పెద్దక్షరాల్తో సంతృప్తి పడదమన్న మాట.

సుంద: ఆఁ! అదంతా చదివే ఓపికా, తీరికా ఎక్కడ వచ్చింది. ఏమం టావురా రాజా?

రాజా: ఏదో ఒక అమూల్య అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నావుగా. కానీ.

సుంద: ఇందులో వేరుగా మన అభిప్రాయమేముంది? అందులోని సారాంశమంతా పై శీర్షికలోనే వుంటుందిగా. మిగతాదంతా చదవడం అనవసరం.

జోగా: అదే పొరపాటు. ఆ మాటకొస్తే యిక పత్రికలో శీర్షికలుదప్ప మిగతా వ్రాత వుండడమే అనవసరం. కాని, చూశారో, లేదో ఒక్కొక్కప్పుడు పై శీర్షిక వేరూ, లోపలి విశేషాలు వేరుగా వుంటాయి. అసలు విషయం తెలుసుకోవాలంటే ఆమూలా గ్రంగా అంతా చదవాల్సి వస్తుంది.

రాజా: మొత్తమ్మీద, మీరు అన్నివిషయాలనూ చాలా సీరియస్‌గా తీసుకుంటారు.

జోగా: అవసరమున్నవరకు అన్ని విషయాల్లోనూ అలా వుండడమే మంచిదని నా అభిప్రాయం.

సుంద: ఆగు. ఆగన్నయ్యా ఆగు. రాత్రి నాటకపు ఎడ్వర్ టైజ్ మెంటు ఇవేళ కూడా పడ్డట్టుందే?

రాజా: ఏ నాటకం?

జోగా: ఏ నాటకమేమిటీ? ఇందిర నటిస్తున్న నాటకమే. రాత్రొక ప్రదర్శన జరిగిందిగా.

రాజా: అవును. మళ్లీ యివేళ కూడా వుందాయేం?

సుంద: ఏం, తెలియనట్టడుగుతున్నావు. ఆ విషయం రాత్రే స్టేజిమీద చెప్పారుగా !

రాజా: అలాగా ? రాత్రి నేను నాటకానికి రాలేదులెండి.

సుంద: అలా చెప్పు ! ఏం, ఎందుకని రాలేదు ?

రాజా: కొంచెం సుస్తీగావుండి రాలేదు.

జోగా: రాకపోవడమే మంచిదైందేమో అబ్బాయీ !

రాజా: ఏం, అలా అన్నారు మామయ్యా !

జోగా: ఇదిగో ! ఈ అడ్వర్ టైజ్ మెంటు చూశావుగా! అందులోనూ, యీ బొమ్మలుచూడు. ఆ పోజ్ చూడు, దానికింద వాళ్ల కవిత్వంచూడు !

సుంద: ఏం వ్రాశారేమిటి ?

జోగా: ఏం వ్రాశారో నా నోటిమీదుగా చెప్పడం అసహ్యం. కాని- ఇందులో పడ్డాక నేను చెప్పకపోవడంలో ప్రత్యేకతేమీలేదు. అందరూ వాళ్లంతట వాళ్లే చదువుకుంటారు.

సుంద: ఏం వ్రాశారేమిటి ? "రఘూ, శ్యామల పవిత్ర ప్రణయజీవితాన్ని ప్రఖ్యాత ప్రేమజంట మూర్తి ఇందిరలు రంగస్థలంపై మృదుమధురమైన పాటలతో, దూసుకోపోయ్యే పోజులతో, హృదయాల్ని కదిలించే నటనతో ఎలా మీ కళ్లకట్టిస్తారో మరోసారి ఈ రాత్రి 9-30 గంటలకు చూడండి." నాటక మన్నాక, ఆకర్షణకోసం అనేక విధాల పబ్లిసిటీ యిచ్చేమాట నిజమే. కాని, యింతగా యిష్టం వచ్చినట్టు వ్రాయించడం అంత బాగాలేదు రాజా. దీన్ని ఆపలేకపొయ్యావూ ?

జో గా: అదేం వెర్రిమాట సుందరం! అసలు, ప్రదర్శనంటూ యిస్తున్నాక దానికి తగిన పబ్లిసిటీ కూడా యిష్టమొచ్చినట్టు యిచ్చుకోవడం అవసరమవుతుంది. ఇష్టంలేనప్పుడు ఆపాల్సింది మన వ్యక్తుల్నిగాని, పబ్లిసిటీని కాదు.

సుంద: అంటే, అసలు ఇందిరను నాటకాల్లో పాల్గొనకుండా చేయాలన్నమాట.

జో గా: నిజానికిజరగాల్సిందదేకాని, అలా చేయగలిగింది మనం కాదుగా. రాజు చేయాల్సిన పని. ఏం రాజూ!

రాజా: చాలాదూరం పోయ్యారు.

జో గా: లేదు. అసలు విషయానికొచ్చాను. ఇదే- నీ బంధువులకూ, నీ తల్లిదండ్రులకూ యిష్టం లేనిపని.

రాజా: నేనది తప్పనుకోలేదు.

సుంద: ఏదంటావు? ఇందిర పరపురుషులతో నటించడమంటావా? నటిస్తున్నప్పుడు యిచ్చే యీ పబ్లిసిటీనంటావా?

జో గా: అదేమిటి సుందరం! మళ్ళీ మొదటికొచ్చావు. ఒక దాన్నుంచి ఒకటి విడదేసే వీలే లేదు. అన్నిటికీ అంగీకరించ గలగడమే అది తప్పు కాదనుకోవడం.

రాజా: మీరు- చాలా తప్పుగా అర్థం చేసుకొంటున్నారు మామయ్యా!

జో గా: అసలు నీవు తప్పే లేదనుకున్నాక, మేము అర్థం చేసుకోవడం అంత తప్పను కోను.

రాజా: మీరు, మరో దృక్పథంనుంచి ఆలోచిస్తున్నారేమోనని___?

జో గా: అవును. దాన్ని అనేక దృక్పథాలనుంచి ఆలోచించే వీలుంది

గనుకనే. అలాచేయాల్సి వచ్చింది మరి. అయితే- నీ వనుకునే దొకటీ, లోకమనుకునేది మరొకటీ కావచ్చు.

రాజా: లోకం ఏమైనా అనుకుంటుంది. అలాగని మనం మంచిదనుకున్న కార్యక్రమాన్ని మానుకుంటామా ?

సుంద: లోకంమాత్రం పూరికేనే ఎందుకనుకుంటుందేమిటి ? దానికీ ఏవో బలమైన కారణాలుంటాయి.

జో°గా: ఉంటాయికాదు; ఉన్నాయి. ఏవో అరుదుగా జరగని విషయాలు వదిలేస్తే తరుచుగా లోకం అనుకునేవన్నీ నిజం. ఈ బొమ్మలూ, దానికింది రాతలూ చూశాక ఎవరూ నీరిద్దరినీ నటీనటులనేంత పవిత్రంగా అనుకోరు. ప్రేమజంటనే అనుకుంటారు. ఇంకా చిలవలూ, పలవలూ కల్పిస్తారు. లోకం, ఏవిషయాన్నీ లోతుకు దిగి ఆలోచించదు. పైపైన్నే చూసి, తన అభిప్రాయాన్ని నిర్ణయించుకుంటుంది. నలుగురితో పనున్నవాడు, పదుగురి అభిప్రాయానికి బద్ధుడు కాకతప్పదు.

రాజా: ఇందులో అంత దోషముందా?

జో°గా: ఒక విధంగా నీవు చాలా అమాయకుడివి రాజా! మన తరగతి కుటుంబాల్లోని స్త్రీలెవరూ ఎక్కువగా బైటికే వెళ్ళని సాంప్రదాయం వుంది. సరే. ఈ మధ్య కొంతవరకు అది సడలిపోయినా- యిలా పరాయివాళ్ళతో నాటకాలాడేదా కాపోతే. నీకిది పెద్ద దోషం కాకపోవచ్చు. కాని, చూచి వింటున్న వాళ్ళకు చాలా కష్టమనిపిస్తుంది. నిజం చెప్పాలంటే- నా వరకు నేనుకూడా నిన్ను వ్యతిరేకించాల్సి వస్తుంది. అందుకే ఈ సంబంధంవిషయం గట్టిగా తేల్చలేకపోతున్నానని నిజం చెబితే నీవు ఆశ్చర్యపడ్డావు.

రాజా: మీకూ అదే అభిప్రాయమా?

జోగా: లోకంతోపాటు నేనూ, రాజూ. వ్యక్తిగతంగా నీవూ, ఇందిరా నా కన్నబిడ్డలతో సమానమే. కాని, అలాగని నేను సంఘంతో సంబంధాలు వదులుకొని బాధపడను. అలా బాధపడవలసిన అవసరమూ కనబడడంలేదు. బహుశా- ఈ విషయమ్మీదనే రాజ్యానికొచ్చిన సంబంధాలనేకం చిట్లిపొయ్యాయని నా నమ్మకం. మీ నాన్నా, అమ్మకుకూడా యీ ప్రవర్తనే నచ్చదు. ఇంతజేసి నీ మార్గం మంచిదని గర్వించే అవకాశాల్లేకపోగా చెడుదని వూహించే అవకాశాలనేక మున్నాయి. ఇదివరకెన్నో సంసారాలుకూడా దీంతో విచ్ఛిత్తయ్యాయి. నీకీ వాదం నచ్చకపోవచ్చు. కాని- బాగా ఆలోచించు, ఈపరిస్థితి ఎలా పరిణమించవచ్చునో? నీ వెనకాల ఎందరు నవ్వుతున్నారోచూచుకో! అందుకనే- ఎవరైనా సాంప్రదాయాలూ, సత్ప్రవర్తనంటూ విచారిస్తారుమరి.

రాజా: మామయ్యా! నాలో ఏదో గాలికుమారం రేపారు.

సుంద: అంత దుర్బలహృదయుడవైతే ఎలా రాజూ! బాగా ఆలోచించు. ఈ నాటకాల ప్రమేయం ఎందాకాపోతుందో?

రాజా: జరగదు, ఈ రోజు నాటకం జరగదు.

జోగా: ఆవేశంలోవున్న నీవంత స్థిరనిర్ణయాన్ని తీసుకోగలవని నే ననుకోలేను.

రాజా: తీసుకుంటాను, తప్పకుండా తీసుకుంటాను. ఇవేళ నాటకం జరగదు, రాజ్యం వివాహం జరుగుతుంది.

జోగా: సరె. వస్తాను. అయితే- చాలా సంతోషమే. నన్ను తప్పుగా అర్థంచేసుకోకు రాజూ!

రాజా: లేదు మామయ్యా! మీ అభిప్రాయాన్ని నిర్దుష్టంగా వెలిబుచ్చారు. సంతోషం.

సుంద: వస్తారా రాజా! వస్తా. (వెళ్లారిద్దరూ)

రాజా: మంచిది. (ఆలోచన్లో పడ్డాడు. బ్యాక్ గ్రౌండున అతని ఆవేదనను వ్యక్తీకరించేపాట. పాటయ్యాక రాజా బయటికి వెళ్ళబోతుండగా సోమశేఖరం, ఆనందంల ప్రవేశం)

సోమ: ఏమండీ! ఇందిరా దేవి గారి యిల్లు యిదేనా?

రాజా: ఏ ఇందరా దేవిగారు?

సోమ: అన్నట్టు- ఆ విషయం చెప్పడం మరిచేపొయ్యా చూశారా! ఏ ఇందిరా దేవి గారేమిటీ? యాక్ట్రెస్ ఇందిరా దేవిగారు. రాత్రి నాటకంలో హీరోయిన్ వేషం వెయ్యలా? ఆవిడ.

అనం: అంత గొడవెందుకు బావయ్యా! ఇదిగో ఈ బొమ్మ చూపించు. (అని పత్రిక విప్పుతాడు)

సోమ: ఆc! అన్నట్టు అదోటుందిగదూ! ఇయితే పత్రిక! (పత్రికవిప్పి బొమ్మచూపి) ఈవిడ గారండీ!

రాజా: ఓహో! ఆవిడగారా? ఆవిడ యిల్లు యిదేనట.

సోమ: ఇంకేం? (అని లోపలికి పోబోతాడు)

రాజా: ఆగండి! ఎక్కడికి?

ఆనం: ఎక్కడికేమిటీ? లోపలికి. ఆవిడగారితో పనుంది. మాట్లాడాలి మరి.

రాజా: ఏమ్మాటది?

సోమ: అదేమిటో వారితో మాట్లాడాలి. ఇంతకూ మీరేమైనా వారిని పిలుస్తారా? మమ్మల లోపలికి పోనిస్తారా?

రాజా: లోపలికివెళ్ళి ఏం జేస్తారు? ఆమెగారింకా లేవలేదట.

ఆనం: ఓ! అలా చెప్పండి మరి. అయితే మీరూ వారికోసమే వచ్చినట్టున్నారు.

రాజా: బాగా కనిపెట్టారు.

సోమ: అన్నట్టు- మావాడు బహుసూక్ష్మగ్రాహిలెండి. నటనకుతోడు వాడికి యీ తెలివితేటలుకూడా ఉగ్గుపాలతో పెట్టిన విద్య. (కుర్చీలోకూల బడుతూ) ఆఁ! ఇంతకూ తమదే కంపినీబాబూ!

రాజా: కంపినీ యేమిటి?

సోమ: నాటక కంపినీవారు కాదాయేమిటి?

రాజా: ఓహో! అదంటారా?

సోమ: చిత్తం. (బీడీలందిస్తూ) ఆఁ! తీసుకోండి.

రాజా: బీడీలు అలవాటు లేవండీ.

సోమ: ఎబ్బే! దానిదేంటీ? తాగుతుంటే అదే అలవాటవుతుంది. నాకు మాత్రం ఇదివరకు అలవాటెక్కడిది? ఇదిగో! వీడి కోసం చేసుకోవాల్సివచ్చింది. మొదట వీనికి ఆకుచుట్టలలవాటు. వాటిని మానిపించడానికి పొగచుట్టల్లోకి దిగి, ఆ తరువాత సిగరెట్లు అలవాటు చేశాం. కాని, సిగరెట్లు వానికెన్ని డబ్బాలైనా సరిపొయ్యేట్టులేకుంటే, కుతి ఆరటానికీ, ఖర్చు తగ్గడానికీ వీలుగా యిలా బీడీలు కాల్పించాల్సి వస్తున్నది. వాడు వేరూ, నేను వేరూ అయితే బాగుండదని నేనూ దానికే పూనుకున్నాను. పైగా- కొంతలో కొంత యివి ఆరోగ్యమటకూడాను.

రాజా: మంచిపని చేశారు. ఇంతవరకూ తమరెవరో సెలవిచ్చారు కారు.

సోమ: అన్నట్టు-ఆ విషయమే మరచిపొయ్యాంచూశారూ? అయినా-మా విషయం మేం చెప్పుకోడం బాగుండదు చూడండి.

ఆనం: అదెలా బావా? మనది మనం చెప్పుకోకుంటే ఎవరు చెప్తారు? అందులో- అడిగాక చెప్పకపోతే బాగుండదు. పెద్దవారు. ఏమైనా అనుకుంటారు. చెప్పెయ్యి బవయ్యా!

సోమ: ఆఁ! మాది లాలాపురమండీ! తెలుసుగా? ఇక్కడికి 80 మైళ్ళుంటుంది. అది ఓ జిల్లాకు ముఖ్యపట్టణం. అక్కడ రైల్వేస్టేషనూ, పెద్ద పోస్టాఫీసూ అవీ వుంటాయి

రాజా: తెలుసులెండి. అవన్నీ తెలుసు. మీరక్కడ?

సోమ: ఆఁ! అక్కడున్నించిక్కడికి రాత్రి నాటకంచూడడానికి వచ్చామండీ! వీడు నందం బి. ఏ.

రాజా: ఆఁ! ఏమిటీ?

ఆనం: పెద్దవారిముందు అలా ఎందుకు బావయ్యా! ఉన్నదున్నట్టు చెప్పెయ్యి.

సోమ: అన్నట్టు — నేనన్నదాంట్లోకూడా అబ్బే లేదండి. తల క్రిందుచేశా నంతేనండి. మా వాడిపేరు అసలు బ్రహ్మనందమండి. ఇప్పటి ఫ్యాషన్ ప్రకారం నందం బి. ఏ. చేశామండి.

రాజా: మంచి ఆలోచన చేశారు. ఇంతకూ-

సోమ: వస్తున్నానండి. వీడు మా బావమరదండీ. గొప్ప యాక్టరండీ. ఆడవేషాలు అమోఘమండీ. మా కంపెనీలో ఆడవేషాలన్నీ వాడివేనండి.

ఆనం: చిత్తం. వీరు మా బావయ్యండీ. మా కంపెనీని స్థాపించింది వీరేనండి. మానేజరూ వీరేనండీ. హీరో వేషాలన్నీ మా బావవేనండీ. ఇంకా ఎవర్నీ వేయనిచ్చి చెడగొట్టనివ్వరండి.

రాజా: బాగుంది. తమ పేరు?

సోమ: అన్నట్టు- ఆ విషయమే మరిచాం చూశారా? అయినా మా విషయం మేం చెప్పుకోవడం బాగుండదు చూడండి.

ఆనం: అదెలా బావా? మనది మనం చెప్పుకోకుంటే ఎవరు చెప్తారు? అందులో- అడిగాక చెప్పకపోతే బాగుండదు.

సోమ: ఆఁ! నా పేరు ఎస్. ఎస్. రం అండీ?

రాజా: అంటే?

ఆనం: అంటే. వేరే ఏమీ లేదండి. సోమశేఖరమండీ.

రాజా: అలా చెప్పండి!

సోమ: మా వాడు చెప్పాడుకదండీ —ఇంతకూ తమ విషయం—?

రాజా: మీ సంగతేమిటో పూర్తిగా చెప్పలేదు. మీరొచ్చినపని?

సోమ: అన్నట్టు- ఆ విషయమే మరిచాం చూశారా? అయినా, మా విషయం—

ఆనం: లేదులే బావయ్యా! మనది మనం చెప్పుకోకుంటే—

సోమ: సరే- అలాగేలే. ఆగు. ఆఁ! ఏమిటంటే- నేను ఈ మగవాని ఆడవేషాల ప్రక్కన నటించడం చాలా తిప్పలైపోతోంది సర్. మరీ ప్రణయదృశ్యాల్లో నాటకం ఏ మాత్రం రక్తికట్టడం లేదండి సర్.

రాజా: అయితే—?

ఆనం: అందుకని- ఎవరైనా ఆడ హీరోయిన్ ప్రక్కనే హీరో వేషం వేయాలని మా బావ యీమధ్య మంచి పట్టుపట్టాడండీ. అందుకని చక్కని హీరోయిన్ కోసం దేశదేశాలూ గాలిస్తున్నామండీ.

సోము: రాత్రి యిక్కడ నాటకముందని యిక్కడికి వచ్చామండీ. మీరు రాత్రి నాటకం చూశారుగదూ!

రాజా: లేదులెండి, ఎందుకూ?

ఆనం: చూడనిదానికి ఏం చెబితే ఏం లాభం లెండి. ఈ ఇందిరాదేవి గారండి, అత్యద్భుతంగా నటించారండి. అందుకని-

రాజా: అందుకని- వారేమైనా మీ కంపెనీకొస్తారేమోనని తెలుసుకో దలుచుకున్నారా?

సోము: చిత్తం. బాగ్గుకున్నారండి. అన్నట్టు- ఒక్క ప్రదర్శనకు ఎంత తీసుకుంటారో మీకేమైనా గుర్తాండి?

రాజా: అంత బాగా తెలియదు కాని- ఏమన్నా తీసుకోంది నటించే వారు లేరా?

ఆనం: (పకపకా నవ్వి) అదేందండీ, అలా అనేశారు. డబ్బులేంది నాటకాలేమిటండీ? చూడబోతే మీరు కంపెనీ మనుషులు కానట్టున్నారు.

రాజా: మీ యిష్టమొచ్చినట్టు అనుకోవచ్చు. కాని- మీరనుకునే సంబంధంలేదు గాని, మరోవిధంగావుంది.

సోము: అమ్మో! చంపారు. అన్నట్టు- అయితే కవిగారయి వుంటారు. ఇదిగో! చూడండీ, మాకో నాటకం కావాలి. వ్రాసిస్తారూ? ఇందిరగారు వొప్పుకుంటేనా, ఆడవేషం పెట్టండి. లేకుంటే అసలు ఆడవేషం లేకుండా వ్రాయండి.

ఆనం: ఆడవేషంలేని నాటకమేమిటి బావయ్యా?

సోము: లేకుంటే- యిక నీ ఆడవేషాలముందర చస్తే వేషం వెయ్యను.

ఆనం: కాకపోతే- పేటనుంచి పలిపిద్దాం.

సోమ: లాభంలేదు. వాళ్ళసలు పోర్షను చదవరు. నాటకం ఖూనీ చేసేస్తారు. అయినా- యివేళా రేపూ చదువుకున్నవాళ్ళు అనేక మంది వచ్చేస్తున్నారు. వాళ్ళతో అయితే- నాటకాలు భలేగా, కొత్తకొత్తగావుంటాయి.

ఆనం: వాళ్ళు మనకు దొరకొద్దూ?

రాజా: వాళ్ళను, వీళ్ళను బ్రతిమాలేబదులు మీ ఆడవాళ్ళనే తెచ్చు కుంటే___?

సోమ: చంపారు కవిగారూ...మీరు కవిగారేనా?

రాజా: అవున్లే. ఆఁ!

సోమ: ఇప్పటికి రంగులుపూసుకున్నవాళ్లు చాలక ఇంకా మా వాళ్ళ కెక్కడ పూయమన్నారూ?

ఆనం: ఆ మాట మా అక్కయ్య దగ్గరెత్తితే పొరక దిరిగేస్తుందండీ.

సోమ: అన్నట్టు- వారెప్పుడు లేస్తారో కనుక్కున్నారా?

రాజా: లేవందే కనుక్కోటమెట్లా?

ఆనం: లేచాక- కనుక్కోటమెందుకూ?

సోమ: అన్నట్టు- మనం లేపితే బాగుకదూ! (లోపలికి పోబోతాడు)

రాజా: ఆగండి. వారిప్పుడు లేవరు. మీ కోర్కెను నారంగీకరించరు.

సోమ: చాలు చాల్లెండి. అడగందే ఎలా తెలుస్తుంది? డబ్బుకోసం కాకపోతే, కళకోసం అడుగుతాం.

రాజా: చాల్లెండి, ముందు బయటికి నడవండి.

ఆనం: ఇది- మరీ బాగుంది. ఈయనతో మనకేంపని బావా? పద, లోపలికి.

రాజా: ఓరి- మీ దుంపతెగా. కాస్త- అలుసిస్తే పూర్తిగా నెత్తికెక్కారు. కోటీ, కోటీ!

కోటీ: ఏంది దొరా? (వస్తాడు)

రాజా: వీళ్ళను బయటికి గెంటు.

కోటీ: ఓల్లయ్యో మీరు? ఎల్లు రెల్లు?.

సోమ: అన్నట్టు, వీడెవడు ఆనందం?

ఆనం: ఎట్లా తెలుస్తుంది బావా? (వెడతారు)

కోటీ: ఓరు దొరా?

కోటీ: ఎందుకొచ్చినుండ్రీ

రాజా: ఎవళ్ళో ఫూల్స్.?

రాజా: ఎందుకో ఒకందు కేడ్వారుగాని- తలు వేసివుంచు- అబ్బబ్బబ్బ. (వెళ్ళిపోతాడు రాజా. కోటీ తలుపు వెయ్యడానికి వెడతాడు. మధ్య తెరలేస్తుంది. ఇందిర పక్కమీద పడుకొని గొణుక్కుంటూ గొణుక్కుంటూ పూర్తిగా పాటపాడేస్తుంది.)

(పాటయ్యాక)

ఇంది: (పక్కనుంచి లేస్తూ) కోటీ!

కోటీ: ఆఁ! ఏంది దొరసానిగారూ!

ఇంది: అదిగో, లేచీలేవగానే నేవది వినక తప్పదన్నమాట. చూడు కోటీ! ఆ దొరసాని అని అనొద్దని ఎన్నిసార్లు జెప్పాను? (పళ్లు తోముతుంటుంది)

కోటీ: శనామాట్లు జెప్పినుగని, మతిఉండదు దొర___

ఇంది: అదిగో, మళ్ళీ అదేమాట?

కోటీ: బాగాదతయిపోయిందండీ? ఓపాలిట్టనే శాంతమ్మ దొరసాని కాడ వుండప్పుడు-

ఇంది: శాంతమ్మ దొరసానెవర్రా?

కోటీ: మీకే దొరసాని ఎరికే తేనట్టుందదేవుండీ?

ఇంది: ఎందుకెరకలేదుగాని- ఎలాగైనా వాళ్ళు పెద్దవాళ్ళాయె. మన కెలా తెలుస్తుంది? నా యీడువాళ్ళయితే, అవి నాతో చదువుకున్నవాళ్ళే ఎక్కువగా దెలుసు.

కోటీ: ఈ శాంతమ్మగారిది గుడ మీ యీడేనండీ? ఎంకటయ్యదొర పెల్లావుండీ?

ఇంది: ఎవరోలే. ఎప్పుడూ మనింటికి రాలేదుగా?

కోటీ: అమ్మో! ఆవెఁ మనింటికొస్తాది?

ఇంది: ఏం? అలా అన్నావ్రా?

కోటీ: అసలావెఁ బైటికెళ్తాదుండీ?

ఇంది: పరదాలో వుంటుందా?

కోటీ: మరేనుండీ?

ఇంది: ఎందుకట?

కోటీ: అదేందుండీ. మీరట్టడుగుతరూ? ఆయ ఎనకట్నించంతే నంట నుండీ? బైటికెళ్ళితే మడుసులు కండ్లబడ్తరంట

ఇంది: చంపావురా కోటీ? ఇంకా నయం. మృగాలు కనబడ్తాయన్లే.

కోటీ: ఆరికి మడిసిపొడ గిట్టదుండీ.

ఇంది: ఏం, కళ్ళు తిరిగి పైత్యం పుడ్తుందా? పోనీలే. ఇంతకూ ఒక సారేమయిందేం?

కోటీ: ఏం లేదుండి, పుటుక్కున నోరుజారి ఓపాలి దొరసానంటం మరిసి, అమ్మగారనన్ను కోరి. ఇంగ ఏం జెప్పనమ్మగోరూ!

ఇంది: చచ్చేట్టు కొట్టిందా యేం?

కోటీ: మరంగుకే గదనుండీ, యీడికొచ్చిందీ?

ఇంది: పాపం, ఇంతలోనే దొరతనంపూడిపోతుందేవోఁ?

కోటీ: ఏవోఁలేరి. ఆడి యెవారవేఁ యేరుండీ. ఇట్ల మీవోతుగ మాట్లాడ్తారుండి? అన్నేవన్నాయెగని, ఆరేరోఁ దొరసాననకుంటె కొట్టిన్ను; మీరేవోఁ అంటేనే కొటేటట్టుందిగద!

ఇంది: ఏం పర్వాలేదు. అలాంటి ప్రమాదమేమీ లేదుగాని- దొరసానేమిట్రూ? అసలు- ఒకళ్ళకొకళ్ళు అలే అనుకోవడమే తప్పుగదా! అందులో గర్వంగా దొరసాన్ననిపిచ్చుకోవడం మాకూ బానిసలుగా పిలవడం మీకూ, అందరికీ తప్పే.

కోటీ: ఎట్టనైన మీ లెక్కేఏరుగనీ. మరి, దొరగార్ని గప్పుడప్పుడు దొరంటె వూకుంటడుగద. మీ వోతుగ తిట్టరుగద.

ఇంది: ఆయనగారికింకా కొన్తో, కూస్తో ఆ పిచ్చివుందిలే. అవునుగాని- ఎటెళ్ళారు వారు?

కోటీ: ఇప్పుడే ఎటోపోయిన్నుండీ. ఇల్లాక ఆ సుందరయ్యగారున్నూ, ఇంకోరో వచ్చిన్నుండీ. ఆరిద్దరితోటి మాట్లాడిన్రూ.

ఇంది: రెండో ఆయన ఎవరదీ?

కోటీ: ఓరో నా కెరకలేదుండీ! కొత్తోరే. సూసబోతే మన రాజమ్మగారి పెల్లిముచ్చటోతుగుంది.

ఇంది: ఓహో! అయితే గారావుగాకయివుంటార్లే.

కోటీ: ఆరోరుండీ?

ఇంది: వారు- మన అయ్యగారికి మావఁవుతాడువరుసకు. ఆయన కొడుక్కి మన రాజ్యాన్నివ్వాలని అనుకున్నాంలే.

కోటీ: ఆఁహాఁ! అట్టజెప్పరి. ఆరు యీడ్నే చదువుతున్రా?

ఇంది: అవును. ఇక్కడే బి. ఏ. అని పెద్దచదువు చదువుతున్నాడ్లే.

కోటీ: ఏవాఁలేరి. బాగ సదివితె అమ్మగారికి మంచిదేగద. సరెగని, మీ వొదినగారి కెట్టుంరో చెప్పరైతిరి?

ఇంది: నెమ్మదేనట. రేపాస్తుందిగా రాజ్యం.

కోటీ: జర నయవేఁగద. పోనీలేరి. సూడు తల్లీ! మరి యియ్యాలగూడ మల్ల డావఁకంపినుందంటగద!

ఇంది: అవును. రాత్రి నాటకం చూశావుగదూ!

కోటీ: సూసినగద, బలేగుందిలేరి. మరి. ఆసెగాడు పాడినపాట రాసియ్యరైతిరి?

ఇంది: రాస్తే చదువుకోగలవాడివి, రాసుకొని చదువుకోలేవూ?

కోటీ: రాసుకోటం నేర్వలేదుండీ, మా పంతులు. సూసి సదువుడే జెప్పిండు.

ఇంది: మంచి పంతులే.

కోటీ: మరి, రాసియ్యరు?

ఇంది: అలాగేలేగాని, ఏదీ కాసిని నీళ్ళివ్వు!

కోటి: అయిగోవుండి, అప్పుడే పెడ్తి. (ప్రక్కకెళ్ళి ముఖంకడుక్కొని తువ్వాలుతో తుడుచుకుంటూ వస్తుంది)అమ్మగారూ! మరి కంపినేవాఁ మల్లగల్లె ఏస్తున్రా?

ఇంది: రాత్రిబాగుందని అంతా అన్నారు. అందుకోనూ చాలామందికి టిక్కెట్లు దొరకలేదట. అందుకని- మళ్ళీ యివ్వేళ పెట్టారు.

కోటీ: అట్టజెప్పరి. బాగనే డబ్బులొ స్తయిలేరి.

ఇంది: సరేగాని- కాసిన్నైనా కాఫీనీళ్ళు పోసేదుందా ? ఇలాగే మాడ్చేస్తావా? ఇంకా తయారుకాలే?

కోటీ: ఓ! కాపై పొయ్యి ఎంతచేసాయే, ఏందీ? మల్లిప్పుడే నీల్లు బెట్టొచ్చిన.

ఇంది: మరి, తొందరగా తీసుకొని రారాదూ!

కోటి: ఇంగో! వస్తి. (వెడతాడు. ఇందిర దువ్వుకుంటూ, బొట్టు పెట్టుకుంటూ ఏదో గొణుక్కుంటుండగా కోటీ కాఫీ తెస్తాడు.)

కోటీ: (కాఫీయిస్తూ) ఇల్లాకనండి, అమ్మగోరూ! ఓరోం మదుసులుండీ లోపల్లొపలికి తోసుకొత్తుంటె దొరగారు ఆల్లను ఆకడికె ఎల్లదోలవన్నరు.

ఇంది: ఎవళ్ళువాళ్ళు (కాఫీ త్రాగుతూ)

కోటీ: ఓరోంనుండీ. సూస్బోతే బల్ పెద్దోల్లోతుగనే కనబడ్డరు.

ఇంది: కనబడడానికేంలే. ఇవాళా రేపు అంతా పెద్దలే. (ఇంతలో బయట తలుపుచప్పుడు) అదేమిటి? తలుపు పెట్టావా యేమిటి?

కోటీ: పోతపోత అయ్యగారు పెట్టవన్నరు.

ఇంది: ఇదేమిటి వేళ చిత్రంగావుందే? (తలుపు మరీ చప్పుడవుతుంది. దబదబా గుద్దుతాడు)

ఇంది: వెళ్ళు తొందరగా, అయ్యగారొచ్చినట్టున్నారు?

[కోటీ వెళ్ళి తలుపుతీస్తాడు. రాజా చీకాకుగా ప్రవేశం.]

ఇంది: అంతయిదిగా తలుపుజాదేకంటే పలవకూడదూ?

[రాజా మాట్లాడడు. కుర్చీలో కూలబడ్తాడు.]

ఏం రాజా? మాట్లాడవేం?......సుస్తీగా వుందా? (రాజా మౌనం) రాత్రి నాటకానికి రాలేదేం రాజా?......మాట్లాడవేం రాజా?......ఏమిటిదీ- అలుకా? కోపమా? (దగ్గరికెళ్ళి భుజాలుబట్టి వూపి) రాత్రి నాటకానికెందుకు రాలేదురాజా?

రాజా: కోటీ! ఒరేకోటీ!

కోటీ: (వచ్చి) అయ్యాదొర!

రాజా: సిగరెట్ పెట్టొకటి పట్రా (కోటీ కదలడు) వెళ్ళవేం? అలాగే నుంచున్నావేం?

ఇంది: నిలుచోక ఏంచేస్తాడు? మన కెవరైనా సిగరెట్ పెట్టెలు వూరికే యిస్తారా? ఉండు కోటీ! (పక్కనున్న చొక్కా జేబులోంచి డబ్బుతీసి యిస్తుంది. సిగరెట్ పెట్టె తెస్తాడు కోటీ. అందాకా నిశ్శబ్దం. సిగరెట్టు వెలిగిస్తాడు)

ఇంది: (తిరిగి) రాత్రి నాటకానికి వస్తానని రాలేదేం రాజా?

రాజా: నేను రాకుంటే ఆగిందా యేమిటీ?

ఇంది: ఏది ఎవరికోసం ఆగుతుంది రాజా? ఎందుకు రాలేదూ?

రాజా: నీవెళ్ళావుగా, చాలదూ?

ఇంది: అంటే?

రాజా: అంటే యేముంది? నీవు నాటకాలాడ్తూనే వున్నావుగా?

ఇంది: నాటకాలాడడమంటే?

రాజా: నాటకాలాడడమంటే, నాటకాలాడడమే. నాటకాలూ, ఆడడమూ. తెలియలేదా?

ఇంది: ఏదో అర్థంతో మాట్లాడుతున్నావు.

రాజా: మరేదో అర్థానికూడా అవకాశముందన్నమాటేగా?

ఇంది: మాటలదేముంది రాజా? అవి, మన చేతిలోని కీలుబొమ్మలు. మనమెలా అంటే అలాంటి అర్థాన్నిస్తాయి.

రాజా: ఎలా 'అనే' బదులు, ఎలా 'వుంటే' అలాంటి అర్థాలు స్ఫురిస్తాయంటే బాగేమో!

ఇంది: ఏమిటో రాజా! నీవేమిటో చిరాగ్గా వున్నట్టున్నావు. తర్వాత శాంతంగా చెబుదువుగానిలే. కాస్త పడుకోనీ (వెళ్ళబోతుంది)

రాజా: ఆగు ఇందిరా! ఆగు. (ఆగుతుంది) ఇప్పటిదాకా పడుకున్నది చాలదూ?

ఇంది: మళ్ళీ రాత్రికి నాటకముంది రాజా!

రాజా: రాత్రికక్కడ నాటకాలూ, పగలిక్కడ పడకలెందుకూ చెప్పు?

ఇంది: అంటే?

రాజా: అంటే, అంటే, అంటే, అంటే అదంతే. రాత్రికి నాటకముందని యిప్పుడేమీ పడుకో అక్కర్లేదు.

ఇంది: నీకేం? మేలుకొని అవస్థపడాల్సింది నేనుగా.

రాజా: అంత అవస్థపడడమెందుకూ?

ఇంది: అవసరమైనప్పుడు నీవు రాత్రంతా మేలుకొని బొమ్మలు గీయడమూ, పాటలు పాడడమూ అవస్థగా నేవుందా?

రాజా: అదిప్పుడనవసరం.

ఇంది: ఇంతకూ- నీవిప్పుడు అవసరంగా చెప్పదలుచుకుందేమిటి?

రాజా: అదేవుంది; చెబుతాను.

ఇంది: చెప్పమరి. సందేహాలతో చంపుతావెందుకూ?

రాజా: ఇందులో సందేహమేముందీ? ఆc! ఇవేళ నాటకముండదు.

ఇంది: కారణం? క్యాన్సిలయిందా?

రాజా: ఇదివరకు కాకపోతే- ఇప్పుడవుతే అవుతుంది; లేకపోతే లేదు. అది మన కనవసరం.

ఇంది: అంటే?

రాజా: అంటే లేదు; గింటే లేదు: నీవీరాత్రి నాటకానికి వెళ్ళడంలేదు. తెలిసిందా....మాట్లాడవేం?...ఏం?

ఇంది: ఏం మాట్లాడను? ఇది నీ ఆజ్ఞా? సూచనా?

రాజా: సూచనగానే తీసుకో. కాని- సూచనతో మానుకోలేనను కుంటే, ఆజ్ఞగానే తీసుకో. నాకే అభ్యంతరమూ లేదు. పని కావాలంతే.

ఇంది: ఇంత హాటాత్ మార్పుకు కారణమడగొచ్చా?

రాజా: కారణాలు లక్షలున్నాయి.

ఇంది: పోనీ- కొన్నయినా చెప్పే వీలుందా?

రాజా: లేదు: ఒక్క కారణంకూడా చెప్పాల్సిన అవసరంలేదు.

పద్మాకర్: (ప్రవేశిస్తూ) ఏమిట్రోయ్, ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం ప్రయోగిస్తున్నావ్. ఎవరిమీద? అపరాధి ఎవరు?

ఇంది: అంత తేలిగ్గా వున్నదింకెవరుంటారు? అయినదానికీ, కానిదానికీ ఆలి వొకతి దొరుకుతుందిగా, అన్ని అపరాధాలకూ.

పద్మా: కోపంలో అన్నా నిజం చెప్పావు చెల్లీ! ఈ విషయాన్నే ఒక మహాకవి తన కావ్యంలో 'స్త్రీ భర్తకు బానిస' అన్నాడు.

ఇంది: ఎవరా మహాకవి?

పద్మా: ఎవరో తెలిస్తే పేరే చెప్పేద్దునుగా.

ఇంది: మొత్తంమ్మీద నీవు సీరియస్ విషయాలనుకూడా బహు తేలిగ్గా చూస్తావన్నయ్యా!

పద్మా: లేకుంటే- ప్రతి చిన్న విషయాన్నీ సీరియస్‌గా తీసుకొని- అయిన దానికీ, కానిదానికీ రాత్రింబవళ్ళు ఏదోవిధంగా ఏడుస్తూ కూర్చోమన్నావా యేం? అలా చేస్తే, మన జీవితంలో తగిలిన దెబ్బలకు ఏ నాడో తార్‌న ప్రాణాలు విడిచేవాళ్లం.

ఇంది: అంత ప్రమాదాలేమొచ్చాయేమిటి?

పద్మా: ఎంత పెద్దమాట వాడేశావ్ ఇందిరా! పోనీలే. నీవన్నట్టు. నిజానికవి అందరి దృష్టిలో పర్వతాల్లాంటి ప్రమాదాలే అయినా, ఈ పద్మాకర్ గాడి దృష్టిలోమాత్రం ఇసుక రేణువులే.

ఇంది: ఏవవి?

పద్మా: ఏవని చెప్పను? అనేకమున్నాయి మరి. అవన్నీ చెబితే ఓ లిస్టే యివ్వాల్సివస్తుంది. పోనీ- అందాకా ఎందుకు? మీ వదినె, అంటే మా ఆవిడ శశి సంగతి తెలుసుగా? ఏరా రాజా! నీవూ వింటున్నావుగా?

రాజా: ఆ.

పద్మా: ఏమిటది ఆ?

రాజా: ఒక్క- మీ ఆవిడేమిటి? సినిమాల్లో నటించే వాళ్ళందరి సంగతీ ప్రతివాళ్ళకూ తెలుసు?

ఇంది: ఆఁ! ఏమ్మాటది రాజా!

పద్మా: ఏమ్మాటేమిటి. ఇందిరా? అందరనేమాటనే రాజాకూడా అన్నాడు. ఇలాగే ఒకళ్ళిద్దరు ఆప్తులనుకున్న వాళ్ళుకూడా ఒకసారి నన్ను పట్టుకొని మొహంమెదుటే అడిగారుకూడాను.

ఇంది: ఏమని?

పద్మా: నీవు పిచ్చిపిల్లవు ఇందిరా! ఏమని అడుగుతారేమిటి? 'ఒరే పద్మ ! శశి అలా పదిమందితో కలుసుతుంటే ఎలా చూస్తూ వూరుకో

గలిగావురా?' అన్నారు, ఏదో మహా గొప్పదానిలాగా. 'కులకగా చూసిందెవరు? చూస్తేమటుకు చేసేదేమి' టన్నాను.

రాజా: బహు ఘనమైన జవాబిచ్చినట్టు మాట్లాడుతున్నావు. చెప్పకోడానికి సిగ్గుండొద్దూ?

పద్మా: అర్థంలేని సిగ్గు బిడియాలకు విలువనిచ్చి, నా జీవితాన్ని కలత పెట్టుకో దలుచుకోలేదు.

రాజా: మనిషికి సిగ్గు బిడియాల్లేకపోతే యింకెందుకూ?

పద్మా: ఎందుకేమిటి? హాయిగా బ్రదకడానికి. కావల్సింది నీతి నియమాలుగాని, సిగ్గు బిడియాలు కావు.

రాజా: అవి మాత్రమెందుకూ?

పద్మా: జీవితపు అసలైన విలువలు దానిమీద ఆధారపడున్నాయని నా నమ్మకం. అయితే- వాటికి నేనిచ్చే అర్థం వేరుకావచ్చు. సరె పోనివ్వు. ఇంతకీ- మీ గొడవకు కారణమేమిటో అసలు విషయమేమిటో చెబుతారా?

రాజా: పద్మం! అనవసరంగా ఆంతరంగిక విషయాలలో నీవు జోక్యం కలిగించుకోకు.

పద్మా: అప్పుడే బైటపడి, మనదాకా వచ్చాక యింక అంతఃపుర రహస్యమేమిటీ? అయినా- తమ కవసరమైనన్నాళ్ళు మాత్రం ఈ పద్మాకర్ గాడు కావాలీ? ఆతర్వాత నేమో? వారేడిప్లమసీ. నిన్ను ఏ దేశానికన్నా రాయబారిగా పంపాలి.

రాజా: ఇప్పటిదాకా నీవిచ్చిన సలహాలు చాలు.

పద్మా: అమూల్యమైన మనసలహాలకేం ప్రమాదం వాటిల్లిందిరా? అసలు విషయం తేల్చకుండా, మనసులో మాట మనసులోనే వుంచుకొని కుళ్ళి చస్తే ఎలా పాడవుతుందిరా?

రాజా: అవును. ఇప్పుడు పరిస్థితి అలాగే వచ్చింది.

ఇంది: ఏమిటది?

రాజా: రాజ్యానికిప్పుడు పెళ్ళి కావాలి, తెలుసుగా.

ఇంది: కావాలి. అయితే యేం? అదేం కొత్త సమస్య కాదుగా.

రాజా: అది కొత్తది కాదు. కాని, దానికోసం కొన్ని కొత్త సమస్యలు వచ్చాయి.

పద్మా: ఏమిటవి?

రాజా: ఇందిర నాటకాలు మానేయాలి.

పద్మా: నీవు చెప్పేది నాకేమీ అర్థం కాలేదు. అవసరమైతే మానెయ్యొచ్చు. దానికేం?

రాజా: లేదు. ఇవేళటి నాటకంకూడా మానెయ్యాలి.

పద్మా: చంపావురా రాజా! చంపావు. ఉన్నట్టుండి నీకీ ప్రమాదమైన వూహ తడితే ఎలా పాడవుతుంది? బుక్ చేసుకున్న నాటకమెలా అగుతుంది? నేనేమై పోవాలి? మన ఆర్గనైజర్ పోష్టు ఏమయి పోవాలి? ఇవన్నీ ఆలోచించావా?

రాజా: అవ్వన్నీ నాకనవసరం. నాతో ఆలోచించి చేశారా?

పద్మా: రాత్రేమో నీవు రాలేదు. అయినా- నిన్ను ఆలోచించి చేయాల్సిన అవసరం? ఇదేం ఘోరం ఇందిరా?

ఇంది: నాకూ ఏమీ అర్థం కావడంలేదన్నయ్యా?

పద్మా: నిన్నలేని తొందర ఇవేళేమొచ్చిందిరా దీనికి?

రాజా: అవును. జోగారావుగారు యివేళే వచ్చారు.

ఇంది: అయితేమాత్రం, వారిరాకడకూ, యివేళటి నాటకానికీ సంబంధం?

రాజా: అవన్నీ అడక్కు.

పద్మా: అవేవీ చెప్పకుండా యిలా మానేయమనడంమాత్రం తెలుసూ?

ఇంది: మీ మగవారు ఎంతకైనా ఘనులు.

పద్మా: ఇందిరా! నన్నూ అందులోనే జమ కట్టావూ? లేకుంటే కొంప దీసి, ఆడవాళ్ళలో కలిపేశావా?

ఇంది: నీకు ప్రతిదీ పరిహాసమే అన్నయ్యా!

పద్మా: పరిహాసంగాకుంటే, యిందులో అర్థమేముంది చెప్పు!

రాజా: అవును పద్మం. నేనిది సీరియస్‌గానే చెబుతున్నాను.

పద్మా: అయితే నేనూ సీరియస్‌గానే అడుగుతానిక. కారణం?

రాజా: ఇలా- ఇందిర పదిమందితో కలిసి నాటకాలాడడంవల్ల మన పరువు ప్రతిష్ఠలకూ, గౌరవ మర్యాదలకూ, యింకా అనేక దుష్ఫలితాలకు కారణమవుతోంది.

ఇంది: ఈ మహత్తర రహస్యం యివేళ కనిపెట్టావా?

రాజా: నన్ననవసరంగా హేళనచేయడానికి ప్రయత్నించకు ఇందిరా!

పద్మా: ఇందులో ఒకరు చేసే హేళనేమీలేదు రాజా! నీ అంతట నీవే భ్రమపడుతున్నావు. ఇన్నాళ్ళనుంచి పోని గౌరవ మర్యాదలు యీ నాడు పోతున్నాయా?

రాజా: ఈ నాటికి గుర్తించాను.

పద్మా: మహత్తర సత్యాన్ని గుర్తించావు మహా. వ్యక్తిత్వం వచ్చాక జీవితంలో ఒక అడుగు వేసేముందే చాలా జాగ్రత్తగా వేయాలి రాజా!

రాజా: ఇప్పుడేం?

పద్మా: ఇప్పుడేమా? ఆ నాడు, యిప్పుడు నీవంటున్న గౌరవ మర్యాదలు అర్థంలేనివని త్రోసేసి, నీ తల్లిదండ్రులనూ, బంధుమిత్రులనూ వదిలేసి- నటిరూపంలోవున్న ఇందిరతో మనసును కలిపి, పెళ్ళి చేసుకున్నావు. ఆ విషయంలో అనేక కష్టనష్టాలను ఎదుర్కొన్నావు. నీతోపాటు మేమూ ఎదుర్కొన్నాం. కానీ- యివేళేమంటున్నావు?

రాజా: ఇందిర నటిగా జీవించడం వృత్తా? మానెయ్యకూడదా?

పద్మా: ఎందుకు మానెయ్యకూడదూ? మానెయ్యొచ్చు. కాని- నేనడిగే ప్రశ్న మానెయ్యడం కాదు; ఎందుకు నటించకూడదని? ఏదీ- నీవు బొమ్మలు గీయడమూ, పాటలు పాడడమూ మానెయ్యి.

రాజా: దానికీ, దీనికీ వున్న సంబంధం?

ఇంది: కళకూ, వ్యక్తికీవున్న బంధం.

రాజా: ఈ కళలనీ, బంధాలనీ చెప్పి అనవసరంగా మోసంచేయడానికి ప్రయత్నించకండి.

పద్మా: ఇందులో- ఒకరు మోసపుచ్చడమూ, మరొకరు మోసపోవడమూ అనేది లేనేలేదు. అందులోనూ- నీవేమీ పిల్లవాడివికాదు, మోసపోవడానికి. అన్నీ తెలిసే యీ జీవితం సుఖవంతమైందని యిందులో ప్రవేశించావు. తిరిగి ఇప్పుడు బాగాలేదని వదిలేసిన పాత జీవితంలో ప్రవేశిస్తానంటున్నావు.

రాజా: ఈ జైలుకెప్పుడూ బందీని కావల్సిందేనా?

ఇంది: ఆ రోజుల్లో అదే జైలనీ, యిదే అసలైన ప్రపంచమనీ తేల్చుకొని యీ దారి త్రొక్కావు. అదిప్పుడు మరచినట్టున్నావు?

పద్మా: అయినా- గట్లు తెంచుకొనివస్తున్న యీ ప్రవాహానికి నీ వేదో అడ్డుకట్టలు వేద్దామని ప్రయత్నిస్తున్నావు. కాని- అది వృధా ప్రయత్నం. ఈ నాడు ఏ స్త్రీనీ పురుషులతో కలిసి మెలిసి తిరగొద్దనీ, బైటి ప్రపంచాన్ని చూడొద్దనీ శాసించలేవు.

రాజా: అంతా కబుర్లు చెప్పేవారే. ఆచరణ కొచ్చేసరికి అంతా దిగజార్తారు.

పద్మా: ఈ వాదమే ఆ నాడు నీవుచేసి, ఆదర్శవంతంగా పనిచేసి- కళలకూ, సమాజానికీ సేవజేశావు. దాని ఫలితం వూరికే పోలేదు. ఈ నాడు అనేకమంది స్త్రీ పురుషులు కలిసి సాహసంగా వచ్చి ఈ రంగంలో సేవచేస్తున్నారు. కాని- ఈ నాడు నువ్విలా అంటావనుకోలే.

రాజా: నా కసలు స్త్రీ పురుషులు కలిసి పవిత్రంగా జీవిస్తారనే నమ్మకం లేదు.

ఇంద: ఒకరి నమ్మకాలకోసం యీ ప్రపంచం ఆగదు రాజా! కాని- నీవు యిలా మాట్లాడడం స్త్రీ జాతినవమానించడమే. పురుషునికి లేని పవిత్రత స్త్రీకి లేదు. అన్ని విషయాల్లోనూ పురుషుడెంతో స్త్రీ అంతే. అయినా- యీ విషయాన్ని నీకు ఒకరు చెప్పాల్సిన అవసరం లేదు.

పద్మా: మనిషి హృదయం దౌర్బల్యమైనపుడు ఒకళ్లు చెప్పాల్సే వస్తుంది.

రాజా: మీరనవసరంగా అవీ యివీ చెప్పి నా అభిప్రాయాలను మార్చడానికి ప్రయత్నించకండి.

పద్మా: రాజా! ప్రస్తుతం- నీ అభిప్రాయాలవీ కట్టిపెట్టి, రాత్రి నాటకమయితే పడేట్టుచూడు.

రాజా: అదసంభవం.

పద్మా: అదే- ఆగిపోతే, నేను చాలా నష్టపడాల్సొస్తుంది.

రాజా: దానికి- నేను కాదు బాధ్యుణ్ణి.

ఇంది: నా మాటపోతుంది.

రాజా: ఏం పర్వాలేదు.

ఇంది: మీ మాటలకున్న విలువ, మా మాటలకూ వుంటుంది.

రాజా: అలా లేకుండా వుండేందుకు ప్రయత్నించు.

ఇంది: తరువాత- పదిమందిలో తలెత్తుకొని తిరగలేం.

రాజా: ఇప్పుడుమాత్రం తలెత్తుకొని తిరగ్గలుగుతున్నాం గనుకనా? బజారుకెడితే ఫలానివారి భార్య నటి అంటే, ఫలానావారితో కలిసి నాటకాలాడుతున్నదంటే కుళ్ళిపోనాల్సొస్తున్నది.

పద్మా: ఏమిటోయ్ మహా, భార్యట, భార్య. నీకే వుందా యేమిటోయ్ భార్య. మా కందరికీ లేరూ? ఇంతకన్నా స్వేచ్ఛగా వాళ్ళు తిరగడం లేదా ఏమిటి? నీవేమన్నా మా కంటే ఎక్కువ చదువు వెలగబెట్టావా?

రాజా: ఎవరిష్టాయిష్టాలు వారివి.

పద్మా: మరి నీయిష్టం యిందిరమీదేమిటి? భార్యంటే బొమ్మనుకున్నావా? వస్తువనుకున్నావా?

రాజా: ఏమనుకున్నానో మీ కనవసరం. అదంతే.

పద్మా: పోనీ- ఇంత తొందరలో ఆ తాకీదెందుకూ?

రాజా: ఈ దెబ్బతో కైతే ఆవిడ నటి జీవితం రూపుమాసి పొయ్యేందుకవకాశముందిగనుక.

పద్మా: పరిస్థితి క్లిష్టంగావుందని అనవసరంగా కష్టపెట్టకు రాజా!

రాజా: నేనేం చెయ్యలేను బ్రదర్! (అని వెడతాడు)

పద్మా: ఏమంటావు ఇందిరా?

ఇంది: ఈ పరిస్థితుల్లో నేనేం చేస్తా నన్నయ్యా!

పద్మా: రాజా! రాజా! (పిలుస్తూ వెంటబడ్తాడు)

ఇంది: హబ్బ! మొగవాళ్ళు (అని విచారంగా లోనికెళ్ళిపోతుంది.)

[కాస్త నిశ్శబ్దం. ఇంతలో బయట తలుపు చప్పుడు]

కోటీ: ఓరదీ? (రంగమ్మీదకొచ్చి)

కృష్ణమూర్తి: నేనే. కృష్ణమూర్తిని. తలుపు తీయి.

[కోటీ తలుపుతీసివస్తాడు. కృష్ణమూర్తి ప్రవేశం]

కోటీ: ఓ, మీరా?

కృ: (కుర్చీలో కూర్చుంటూ) ఆc! ఇందరగారు లేరూ?

కోటీ: లోపల పండుకున్నండీ?

కృ: ఇప్పటిదాకా పడకేమిటి? ఆశ్చర్యంగా వుందే?

కోటీ: పిలవమన్నారా?

కృ: పిలవొచ్చులే. ఆc! నీ పేరు?

కోటీ: కోటండి.

కృ: ఏం జేస్తావిక్కడ?

కోటీ: వంటాండీ? ఆc. కని...

కృ: ఏమిటది?

కోటీ: కంపిన్ల ఏసంగూడే స్తనండీ?

కృ: ఆc! ఏ కంపినీలో.

కోటీ: ఇదోర్కు శనా కంపిన్లల్ల ఏసిన్నండి.

కృ: పేరు లేదాయేమిటి?

కోటీ: పేరుదేందుండీ? పెతొక్కడావ కంపినీకి ఏసో పేరుంటదిగని-కంపినీకీ, నాకూ యేం సంబందంలేదుండి?

కృ: అంటే?

కోటీ: అంటేందుండి? నా యేసాలన్ని ఏరుగుంటయండీ.

కృ: ఎట్లాగదీ?

కోటీ: అదేనండి సిత్రం. నేను పెతి డావాలా ఏదో నవ్వొచ్చే యేసం యేసేవోన్నండీ.

కృ: అంటే నీ వేషం నాటకంలో వుండేని కాదన్నమాట.

కోటీ: అంతేనుండీ. మీరు జెప్పింది సత్తెవుండీ. ఏదో నా యిట్టవొచ్చిన యేసం యేసికోనొచ్చి నవ్వొచ్చేవోన్నండి.

కృ: ఆఁ! భలే మొనగాడివే మొత్తానికి! అలా అయితే నాటక వుద్దేశమూ, టెంపో పోదూ?

కోటీ: లేదుండి. అసలయ్యి వుంటేగదుండీ, వద్దనుకోటానికి. ఆమాటలే వుండేవి కాదుండి, మా డావ కంపినీల్ల.

కృ: అయితే- నీవేం వేషాలు వేసేవాడివేవిటి?

కోటీ: ఒకటేంటండీ. అన్నీ యేసేవోన్నండి. కోవటేసం యేసేవోణ్ని. సాయిబేసం యేసేవోన్ని. ఒకొక్కపాలి గడ్డం బెట్టుకునేటోన్ని. మల్లొకొక్కపాలి బోడకేసం యేసేటోన్ని. ఇట్ట అనేక తీర్లుగ యేసం మార్చుకునేవోన్ని లేరి.

కృ: మరి- అక్కడేం మాట్లాడేవాడివేమిటి?

కోటీ: ఇదని ఏం జెపుతనుండీ? ఏదైన ఆ సమయానికి తోసింది అనేవోన్నుండి. జనాన్ని బలేగ నవ్వొచ్చేవోన్నిలేరి. శనా మెడల్సు సంపాయించ్చినున్నండీ

కృ: అలాగా? అయితే- పాపం! సరిప్పుడా విషయమే మానేశా వేం?

కోటీ: ఏమండీ. ఇయ్యాళ్ళేపు నాటకాల్లో ఇట్టాటి గమ్మతు లసలే వుంటం లేదుండీ. అందుకే. అంత పసందుగుంటం లేదుండీ.

కృ: రాత్రి నాటకం చూశావా? ఎట్లా వుంది మరి?

కోటీ: అందులోకూడ ఆసికవుంది గదుండీ.

కృ: అతనూ నీలాగే చేశాడా మరి!

కోటీ: లేదుండీ. ఇది మరోతీరు ఆసికవుండీ. అయినగని, బాగనే వుం దుండి.

కృ: పాటలుకూడా పాడేస్తావాయేం?

కోటీ: ఏదో జరజర వచ్చు లేరి. పాడవఁన్నరా?

కృ: కానీ నాయనా! భలేవాడివి దొరికావు మొత్తానికి.

కోటీ: (పాట పాడేస్తాడు. పాట అయిపోగానే ఇందిర కన్నీరు తుడుచుకుంటూ చప్పున వస్తుంది.)

ఇంది: ఏమిటి కోటీ? వచ్చినవాళ్ళదగ్గర నీ రొదా? ఓహో మూర్తి గారా? నమస్కారం. (కోటీ లోపలికి వెడతాడు.)

కృ: మొత్తమ్మీద చక్కని కాలక్షేపం చేస్తున్నాడు మీ కోటీ.

ఇంది: వాడంతే లెండి. అందులో మీరు కాస్త నాటకం మనుషులని తెలిశాక, వదలిపెడ్తాడా?

కృ: బాగా చెప్పారు...ఆఁ! అలా కళ్ళన్నీ ఎర్రబడ్డాయి.

ఇంది: అవును. రాత్రి నాటకమహాత్మ్యం!

కృ: అయ్యో! ఒక్కనాటితోనే అంత యిదయిపొయ్యారు. కళ్ళు నీరు కారుతున్నాయి. తుడుచుకోండి! (చేరుమాలు ఇస్తాడు)

ఇంది: పర్వాలేదు లెండి. ఈ నీళ్ళు తుడుచుకోడానికి నాదగ్గర బండెడంత చీర వుంది, మీ రుమాలెందుకూ పాపం!

కృ: పోన్లెండి. ఇవేళ, అటు ఆఫీసువైపే రాలేదు.

ఇంది: అవును, రాలేదు.

కృ: నాకర్థమవలే...బహుశా పడుకొని వుంటారేమో!

ఇంది: సహజసిద్ధంగా వూహించారు.

కృ: ఏదో అంతా నాలో లేని కవిత్వానికి మీరు బీజాలేస్తున్నట్టున్నారే?

ఇంది: పొరపాటు. అలా వూహించకండి. ఆఁ! రాత్రి నాటకం ఎలా వుందనుకుంటున్నారు?

కృ: ఎలా ఏమిటీ? గొప్పగావుందనుకుంటున్నారు. దాని విషయమే కంగ్రాచ్యు లేషన్సు తెలుపడానికి వచ్చాను. ఆఁ! రాజాగారు లేనట్టున్నారు.

ఇంది: అవును. లేరు. ఎటో ఒజాయికెళ్ళారు. ఏమన్నా పనుందా?

కృ: ఎబ్బే! వేరే పనేమీలేదనుకోండి. రాత్రి వారు రావట్టున్నారు, తెలుసుకుందామని.

ఇంది: ఒహో! అలాగా?

కృ: ఎందుకు రాలేదో?

ఇంది: వద్దామనుకోలేదు గనుక, రాలేదట.

కృ: మంచి జవాబే.

ఇంది: ఏం, ఇదేమీ జవాబుగా కనబడడంలేదా?

కృ: ఆఁ! దానికేమిఁటీ? ఎలాగైనా కనబడొచ్చు. (అని ఒక పతకం బయటికి తీస్తుంటే)

ఇంది: ఏమిటది?

కృ: ఆఁ! ఇదేమిటన్నారుకదూ?...మీ నటనకు మెచ్చి యివ్వబడు తున్న బహుమతి.

ఇంది: అంటే?

కృ: అంటే ఏముందండీ? మెడల్.

ఇంది: ఎవరిస్తున్నది?

కృ: చూస్తారుగా, తీసుకోండి.

ఇంది: మరి, యింత వ్యక్తిగతంగా యివ్వడమేమిటి? ప్రదర్శన సమయంలో యిస్తే బాగుగాని.

కృ: అదేమిటో చూశాక, మీరామాటనరు- పూర్తిగా వ్యక్తిగతం గనుకనే, యిలా చేయాల్సొచ్చింది.

ఇంది: అంటే? ఇదేదో కొత్తరకంగా వుందే? (విప్పుతుంది. అందులో ఒకప్రక్క అతని ఫొటోవుంటుంది. అదెరిపడి) ఇదేమిటండీ?

కృ: (మాట్లాడడు)

ఇంది: మాట్లాడరేం? ఇందులో మీ ఫొటో జోడించడంలో మీ అభిప్రాయం?

కృ: నోటితో వెలిబుచ్చలేకనే అలా చేశాను.

ఇంది: ఎంత సాహసం! అసలు స్త్రీలు, మీతో కలిసి తిరగడంలో మీ అభిప్రాయమేమిటండీ? నేను మీతోమాట్లాడడమే పాపమైందా మీతో కలిసి నటించడమే దోషమైందా?...మాట్లాడరేం? ... అవును. మీరెందుకు మాట్లాడుతారు. అందుకే ఏ స్త్రీ ఈ రంగలో ప్రవేశించడానికి ముందుకు రాదు. ఏ పురుషుడూ, తన భార్యను పంపడానికొప్పుకోడు. మాట్లాడరేమండీ? ఇందు

కేనా, స్త్రీలు ఎక్కువగా ఈ రంగంలో ప్రవేశించాలని ఉప న్యసించేది. అందుకే ఈ సమాజాలిలా గుంటపూలు పూస్తు న్నాయి. సంఘంలో గౌరవ మర్యాదల్లేవు. పెద్దవారనీ, చదువు కున్నవారనీ, నాగరికులనీ గౌరవించినందుకిదా ఫలితం? వెళ్లం డిక్కడ్నుంచి! ఊఁ, లేవరేం? (లేస్తాడు) ఏదో మీతోవున్న గాఢపరిచయాన్నిబట్టి యీ మాత్రంతో వదుల్తున్నాను. లేకుంటే ఏ స్త్రీ కూడా కాలిబూటు విప్పింది, మీవల్ల బ్రదకలేదు. ఛీ! అంతా బూటకం, కళ బూటకం. (వెడుతుంటాడు) ఇదిగోండి, మీ బహుమతిని మీరు తీసుకెళ్ళండి (అని) మూర్తిగారూ! మూర్తిగారూ! (అంటూ తెరప్రక్కకు వెడుతుంది. కాని- అత నప్పుడే వెళ్ళిపోతాడు. అందడు. రాజా- ఎదురై, ఆవిడనూ, ఆ పతకంతో లోనికీడ్చుకొస్తాడు)

రాజా: ఎందుకు మూర్తిగారు? అక్కడాడే నాటకాలు చాలక యిక్కడికూడా వస్తున్నాడూ? ఇదెప్పట్నుంచి?

ఇంది: రాజా! అసలు విషయం తెలుసుకోకుండా నీవు తొందరపడు తున్నావు.

రాజా: అవును. ఇప్పటిదాకా అదే అనుకున్నాను. కాని, యిప్పుడు తెలుసుకోవడం కాదు, కళ్ళారా చూశాను.

ఇంది: ఏం జూశావు?

రాజా: నేను లేనిసమయంజూసి, మూర్తి వచ్చి వెళ్ళడం.

ఇంది: నీ వుండగాకూడా ఎన్నోమార్లు వచ్చాడు.

రాజా: అది నాతో పనుండన్నా, లేకుంటే నేనున్నానని తెలుసుకో డానికన్నా.

ఇంది: ఆబ్బా! నీ కెలా చెప్పాలి రాజా?

రాజా: ఏమిటది? అబద్ధమా?

ఇంది: కాదు, నిజం

రాజా: నిజమేమిటో నీవేమీ చెప్పక్కరలేదు. జోగారావు మాంవయ్యా సుందరం, యింకా మరెందరో చెప్పారు. లోకం కోడై కూస్తున్నది. నేను కళ్లారా చూశాను.

ఇంది: అబద్ధం, అదంతా అబద్ధం.

రాజా: పాపం! నీవొక్కదానివే నిజం చెప్పే పతివ్రతవు. అయితే ఈ పతకమేమిటి? అరే! ఇందులో యీ మూర్తిబొమ్మ ఏమిటి?

ఇంది: దాని విషయమే నీకు చెప్పదలుచుకుంది.

రాజా: ఎలా కల్పించి?

ఇంది: కల్పించికాదు రాజా! నిజం, నిజం. అక్షరాలా నిజం.

రాజా: నా దగ్గర పందిని నందిగా చెప్పే తర్కం పనికిరాదు ఇందిరా! కళ్ళతో చూస్తున్న నిజం కావాలె.

ఇంది: నీ వేదైతే కళ్ళతో చూస్తూఊహిస్తున్నావో?

రాజా: ఇందులో వూహించాల్సినంత రహస్యమేముంది? ఏమీ లేదు. బట్టబయలవుతోంది. నేనేదైతే కాస్త అనుమానపడుతున్నానో అది అక్షరాలా నిజమైంది.

ఇంది: అబద్ధం రాజా! అబద్ధం. నీ దంతా భ్రమ.

రాజా: ఏదీ? మూర్తి యిక్కడికి రావడం, ఈ పతకం యివ్వడం, నే నొస్తున్నానని చెప్పి వెళ్ళిపోవడం. నీ వతనికి యీ పతకాన్ని తిరిగి యిద్దామని పిలవడం, సమయానికి నేనెదురుగావడం- ఇదంతా భ్రమకదూ! మిథ్య కదూ! పూర్తిగా స్వాములవారి వయ్యావే?

ఇంది: అది కాదు రాజా! మూర్తి ఎందుకొచ్చాడో, ఈ పతకం ఎందుకిచ్చాడో, నే నేవంన్నానో నీకు తెలియదు.

రాజా: ఆ మాత్రం గ్రహించలేనంత దద్దమ్మననంటావా?

ఇంది: కాదు; నీవు అపార్థం చేసుకునే అవకాశాలందంటాను.

రాజా: అవును. నీ తప్పును సమర్థించుకోడానికి ఏమైనా వుందంటావు. కాని- నాకు అలా సమర్థించుకోడానికి పడాల్సిన కర్మ ఏమీ లేదు.

ఇంది: కాదు- నీకు అనుమానం ఎక్కువైందసలు.

రాజా: అసలు- అనుమాన మెందుకు కలుగుతుందంటావు? నిప్పులేందే పొగరాదంటారు. నమ్మతావా?

ఇంది: కావచ్చు. కాని కొన్ని సమయాల్లో మన కన్నుకూడా చెదిరి పొగగా కనబడొచ్చు.

రాజా: అంటే యిప్పుడు నా కన్ను చెదరడమే కాని- ఈ చూస్తున్న పన్నీ నిజం కావన్నమాట.

ఇంది: నీ విప్పుడు చూస్తున్నవన్నీ నిజమే. కాని- నీ వేదైతే వీటిద్వారా ఏదో జరిగిందని వూహిస్తున్నావే అదిమాత్రం నిజం కాదు.

రాజా: ఎందుకంటే- ఎప్పుడైనా అలాంటిది వూహించాల్సే వస్తుంది గనుకా, కళ్ళతో చూడడం ఎలాగూ జరిగేది కాదుగనుకా, నిజం కాదనుకోవాలి. అంతేనా?

ఇంది: అబ్బబ్బబ్బ! ఇంకెట్లా నిజం తేలాలి రాజా?

రాజా: నీ వింకా ఆ శ్రమేమీ పడక్కర్లేదు.

ఇంది: అయితే, యింతకూ నీవిప్పుడేమంటావు రాజా?

రాజా: ఏమంటానా? ఇది. (బలంగా లాగి చెంపమైకొడతాడు)

ఇంది: హబ్బా! ఎంతపని చేశావు రాజా! తరతరాలుగా రాతియుగం నుంచి యిప్పటిదాకా పురుషుడు, స్త్రీ పట్ల చూపుతున్న న్యాయాన్నే నాగరికుడవూ, ఉత్తముడవూ అనుకున్న నీవూ చూపావు అనాలోచితంగా.

రాజా: లేకుంటే, ఈ పనికి ముద్దెట్టుకుంటారు పాపం!

ఇంది: అవును. న్యాయమిదే. మీ యిష్టమొచ్చినట్టు బీచ్ షికారూ, సినిమాలు, నాటకాలూ, క్లబ్బులో విచ్చలవిడిగా అందరితో తిరిగితే తప్పులేదు. కాని- తన స్త్రీ 'పరపురుషునితో మాట్లాడితే తప్పు, కన్నెత్తి చూస్తే తప్పు.

రాజా: చాలించు నీతులు!

ఇంది: ఎందుకని? స్త్రీకి- భర్తంటూ అండలేకుంటే సంఘంలో గౌరవముండదనీ, అందులోనూ భర్త నొదిలిన స్త్రీకి అసలే వుండదనేగా, మీ మగధీరుల ధీమా?

రాజా: ఏమిటా కూతలు?

ఇంది: కారుకూతలు... కాని- నీవూ అందరు సామాన్య పురుషుల్లాగే ప్రవర్తిస్తావనుకోలేదు, నేననలే వివాహ మొద్దనుకున్న దాన్ని నీవేదో మనసిచ్చావని ఉత్తముడవని, నన్నర్థంచేసుకున్నావని, హృదయపూర్వకంగా నమ్మి భార్య ననిపించుకున్నందుకేగా, నాకీ గతి? లేకుంటే- నీతో పాటు చదివి, ఏదో వెలగబెట్టి, నీతో నటించి, ఆడి, పాడి, నీతో అన్ని విధాల సమానస్థాయిలో మెలిగిన నాకు- యీ గతెందుకు కలగాలి? నీ భార్యను కాబట్టేగా?

రాజా: అన్నే తెల్సుకో.

ఇంది: నన్నింకా కవ్వించకు రాజా! కుల స్త్రీలు నాటకరంగానికి రాంది లాభంలేదని ఆ నాడు వాదించి, ఆచరించి, నా కలా స్వేచ్ఛ నిచ్చి, ఈ నాడు ఎవో నాటకాలాడుతున్నాననే అనుమానా లూ, కుళ్ళూ మనసులోనింపుకొని యిలా చేశావుగదూ! నిజంగా ఎవరైనా, ఎక్కడున్నా గుణాలు మంచివి కావాలనే మామూలు సత్యాన్ని గుర్తించలేకపొయ్యావు.

రాజా: గుణాలట, గుణాలు. పాడు గుణాలు. కొంపలో పడుంటే అన్ని గుణాలూ బాగానే ఏడుస్తాయి.

ఇంది: ఏం? ఎందుకుండాలి కొంపలో? విశాలమైన విశ్వంలోని వింతలూ, విశేషాలూ మేం చూడక్కర్లేదా? వినోద విజ్ఞానా లను మేము పొందక్కర్లేదా? గోళ్ళుగిల్లుకుంటూనో, లేసులల్లు కుంటూనో, విస్తళ్ళుకుట్టుకుంటూనో పరదా చాటున ముక్కి, మురిగి, నశించాల్సిన గతి మాకేముంది? ఈ ప్రపంచంలో అన్ని రుచులనూ జుర్రుకునే హక్కు మీకే వుందేం పాపం!

రాజా: ఆట్టే బుకాయించకు.

ఇంది: బుకాయించడం కాదు. తలుచుకుంటే ఏదైనా చేసెయ్యగలం. కాని- మీ అంత అసహనమూ, అనుమానాల్లో, ఆవేశాలూ, మాకు లేవు.

రాజా: ఇక్కడికి వున్నయ్ చాల్లే.

ఇంది: ఏమిటా మాటలు? ఆ మాత్రం మాట్లాడడం మాకూ చేతనవును. కాని- అనవసరంగా జీవితాన్ని, మనసునూ అశాంతి పరచుకో దలుచుకోలేదు. లేకుంటే- నాటకాలాడుతున్నాననే నీ మాట లకూ, గౌరవ మర్యాదలకు భంగం కలిగిస్తున్నాననే నీ వాచ నకూ అప్పుడే తీవ్రంగా జవాబిచ్చేదాన్ని. ఆడది బయటిప్రపం

చంలో తిరిగితే కులట; గట్టిగా మాట్లాడితే రాకాసి, అని మీ అభిప్రాయం గదూ!

రాజా: అలాగే అనుకో.

ఇంది: అబ్బా! ఎంతపని చేశావు రాజా? ఏదో నాటకాల్లో పాల్గొనన్న నివ్వకూడదనే సాకుకు రాజ్యం వివాహం, గౌరవ మర్యాదలూ, అవీ, యివీ అనే కొంత గాలీ దుమ్మూ పోగుచేసుకొని- యింత పరిమాణానికి తెచ్చావా? సరె. ఈ పూట నాటకముందనేది మరిచిపోతున్నావు రాజా!

రాజా: ఎలా వెడతావో చూస్తానుగా?

ఇంది: బ్రతికుండగా, నా మాటకున్న విలువను పోగొట్టుకోను.

రాజా: అంత పట్టుదలయితే, అదేమిటో నేనూ చూస్తాను. (బైటికి వెడతాడు రాజా. పూర్తి నిశ్శబ్దం. చీకటవుతుంది. కోటీ దీపం వెలిగిస్తాడు. బ్యాక్‌గ్రౌండ్‌న పాట. పాట జరుగుతున్నంపసేపు ఇ దిర లేఖ వ్రాస్తుంటుంది.

ఇంది: (వ్రాతయ్యాక) ఆఁ! కోటీ!

కోటీ: అమ్మా!

ఇంది: ఈ వుత్తరం తీసికెళ్ళి కృష్ణమూర్తిగారికిచ్చిరా!

కోటీ: ఇల్లా కొచ్చినోరి కానుండి?

ఇంది: అవును. (కోటీ అటు వెళ్ళగానే ఒక ముసుకు వేసుకొని బయటికి వెడుతుంది.)

[రాజా, పద్మాకర్‌తో పతకం తీసుకొని వస్తాడు.]

రాజా: (కుర్చీలో కూలబడ్తూ) ఇంకేం ఈ పతకాన్నిబట్టి మీ చెల్లెలుగారి ప్రవర్తనను నీవే ఆలోచించుకో. స్త్రీ పదిమందిలో తిరగడం ఎంతవరకు మంచిదో నీవే నిర్ణయించు.

పద్మా: (తీసుకొని) గట్టి చిక్కే పెట్టావు. ఇందిరా! ఇందిరా! (అని పిలుస్తాడు. పలకదు)

రాజా: బహుశా- కోపమొచ్చి వుంటుంది.

పద్మా: లేకుంటే- పడుకుందేమో!

రాజా: ఇప్పుడేం పడక? అయినా, గదిలో చూడు?

పద్మా: (పిలుస్తూ లోపలికి తిరిగి ఖాళీగావచ్చి) ఏదీ? అక్కడాలేదే?

రాజా: ఏమవుతుందింతలోనే.

పద్మా: ఆ నౌకరగాడు, పనిమనిషున్నాడుగా.

రాజా: కోటీ! కోటీ! ఒరే కోటిగా!

కోటీ: (చప్పున వస్తాడు) ఏంది దొరా?

పద్మా: అమ్మగారేదిరా?

కోటీ: యీడేన్న కూకుండి గద!

రాజా: నువ్వెక్కడికేడ్సావ్?

కోటీ: ఆ కిట్టమూర్తి గారికి గదేందో వుత్తరం యిచ్చిరమ్మంటే, గబాల్న బోయి వురికొత్తుండ.

రాజా: (గభాల్న కుర్చీనుంచి ఆదుర్దాగా లేచి) అదుగో! చూశావా నోయ్- నీ చెల్లెలు ప్రవర్తన? ఇప్పుడైనా నమ్మావా? ఇంకెందుకూ, ప్రేమలేఖయి వుంటుంది.

పద్మా: ఛా! అట్లా అనకు... అసలు ఇందిరేదీ? పద లోపల చూడింకా.
(కోటీ వెళ్లాడు లోపలికి)

రాజా: ఇంకా ఎందుకుంటుందీ? అతన్నెక్కడకో సాంకేతిక స్థలానికి రమ్మని వ్రాసుంటుంది. ఏ రైల్లోనో ఉడాయిస్తారు.

పద్మా: అబ్బబ్బ! ఎంతలో ఎంత తేలిగ్గా వూహిస్తావేం రాజా! మనుషులు వ్యక్తిత్వాలకు విలువ నివ్వవు.

రాజా: వాటికో వ్యక్తిత్వమూ, విలువా అంటూ వుంటేగా?

కోటీ: సూసిన. యాడలేరుండీ.

పద్మా: అయినా- నీ వన్నట్టు అటు స్టేషన్‌కు వెడదాం పద. (బయటి కెడుతుండగా పరుగెత్తుకుంటూ వచ్చిన కృష్ణమూర్తి. అంతా లోపలికొస్తారు.)

కృ: ఇందిర గారున్నారా?

రాజా: నీ కోసం రాలే?

పద్మా: ఛా! ఊరుకో రాజా!

కృ: నాకోసమేమిటి? చూడండీ వుత్తరం?

రాజా: ఏమిటది, చదువు.

పద్మా: శ్రీ కృష్ణమూర్తిగారికి! నమస్కారాలు.

అన్నా! ఈ రాత్రి నాటకానికి రాలేనందుకు క్షమించండి. స్వేచ్ఛగా తిరగాలనుకునే స్త్రీకి ఇంట్లో, సంఘంలో ఎలాంటి స్థానమున్నదో మన సమాజంలోకూడా అలాంటి గౌరవ మర్యాదలే వున్నాయని మీ రిందాకిచ్చిన పతకంద్వారా రుజువయింది ఈ తాకిడిని తట్టుకోగలగడం స్త్రీకి చాలా కష్టం. అందుకని- యిక మా అమ్మా, నాన్నల దగ్గరికి వెళ్ళిపోతున్నాను.

మీ ఆశాభంగపు
ఇందిర

పద్మా: ఇదేమిటి రాజా! ఇందిర తల్లి దండ్రులెక్కడున్నారు?

రాజా: స్వర్గంలో. ఇంకెక్కడి ఇందిర? (గభాల్న పడిపోతాడు. అలాగే నిలబడిపోతాడు కృష్ణమూర్తి)

పద్మం: ఇందిరా! (అని మొదట దిక్కులు పిక్కటిల్లేట్టు అరిచి తరువాత) ఇందిరా! ఇందిరా! (అని అరుచుకుంటూ పోతాడు. తెర పడ్తుంది. ముసుగు గప్పుకొని దూరాన వెడుతున్నట్లు నల్లని నీడ. దాని నందుకోలేని ఆవేదనతో) ఇందిరా! ఇందిరా! (అని అరుస్తున్న పద్మాకర్ అరుపులతో తెర పడిపోతుంది)

—:—




పద్మశాలి ప్రింటింగ్ ప్రెస్, రాజమొహల్లా హైదరాబాద్-దక్కన్

# పాటలు

## బ్యాక్ గ్రౌండ్

ఎంత కళాకు సంఘంరా। ఇది
ఎంత అంధలోకంరా॥

సమతనుగోరే సమభావున్నే
కూలద్రోయ యోచించూ
ముందుకుదూగే త్యాగజీవినే
క్రుంగదీయ యత్నించూ॥ ఎంత॥

కళకోసం జీవించే వ్యక్తికి గౌరవమన్నది లేదా
ఆడజాతియైనంతమాత్రమున ఆత్మనిగ్రహము లేదా
ఎంత॥

బురఖామాటుల నలిగిపోవుచే తరుణీజీవితమానా
తెరలనుజీల్చిన ధీరనారులకు
పరిహాసమే ఫలమానా

ఎంతకళాకు సంఘంరా। ఇది
ఎంత అంధలోకంరా॥

# ఇందిర

తూరుపువాటికలో రవళించెను ఏ వెలుగువీణియలో
నా హృదివేదికపై నదియించెను ఏ తలపుకిన్నెరలో॥

కన్నెపూల చిరునవ్వుగీతిలో
కలకోకిల మధుగానవీచిలో

తలలు లేపినవి
తలుపు దీసినవి

ఏ మృదుల రావములో
ఏ మధుర భావములో ॥ తూరు॥

సెలయేరుల కెరటాల తేటలో
చిరుగాలి తెరల ఊలపాటలో

పులకరించినవి
పలకరించినవి

ఏ మృదుల రావములో
ఏ మధుర భావములో

తూరుపు వాటికలో రవళించెను ఏ వెలుగువీణియలో
నా హృదివేదికపై నదియించెను ఏ తలపుకిన్నెరలో

# కోటి

నాడెమైన నగలువెట్టి । నల్లంచుసీరెగట్టి
లహిరిమీదబోతావె । ఓహో పూలరాజమ్మ
లస్కర్ కుబోతావా । రంగుటింగు రాజమ్మ

లస్కర్ కుబోతానో । లండన్ కెబోతానో
నీకు జెప్పాలెందుకురా । గడుసుగోతు పిల్లోడా
మనుసు యిప్పాలెందుకురా । పెడుసువైసుపిల్లోడా

మరిదన్నమాటలకే । చిరుమొర్రులాడబోకే
ఒదినెవరుసకడిగేనే । వొయ్యారిరాజమ్మ
వొగలు వొలుపులెరుగేనే । వొగలమారిరాజమ్మ

అదియిది వొదిలేసుక । వొదినెకాడికొచ్చెవొరుస
చెవులు చేతికొచ్చునురా । కొంటెకాకిపిల్లోడా
చెంపదెబ్బ లేగునురా । సొంటెకాయపిల్లోడా
నాడెమైన నగలువెట్టి । నల్లంచుసీరెగట్టి......

# బ్యాక్ గ్రౌండ్

నీజీవితము శూన్యమేనా
నీభావియెండ మావేనా॥

వెలలేని నీబ్రతుకు వెతలలో మాసెనా
తానునమ్మినవాడు తనగొంతుకోసెనా
నీయెడదలోన కన్నీరుజారేనా॥

నీజీవితము శూన్యమేనా
నీభావియెండమావేనా ॥

నీభావసీమలో కంపాలురేగెనా
నీకళా ప్రేమలో నిప్పు తేకురిసెనా
నీదారిలో కంటకాలు రాలేనా ॥

నీజీవితము శూన్యమేనా
నీభావియెండ మావేనా ॥